# దివ్యపురుషులు

## 1. రాజా రామమోహనరాయలు

వంగదేశమునందు హుగ్లీమండలములో రాధానగర మను నొక చిన్న గ్రామముండెను. దానిలో రమాకాంత రాయలు, తారిణీదేవి యను బ్రాహ్మణ దంపతులకు 1772 సం॥ మే 22 వ తేదీన రామమోహనుఁడు జనించెను. రమా కాంతుఁడు మొట్ట మొదటఁ గొంతకాలము మూర్షిదాబాదు నవాబు నొద్దను, దరువాత, గొంతకాలము బర్ద్వాను మహా రాజు దగ్గఱను బనిచేసి విశేషధనమార్జించి క్రమముగా నొక జమీందా రయ్యెను. రమాకాంతుని కుమారులలో రామ మోహనుఁడు రెండవవాఁడు. మంచి చూపరి. చిన్ననాటి నుండియు మంచిధీపటిమ, సత్త్వోత్సాహములు చూపుచు మాతృభాషయగు వంగభాషలోఁ జక్కని పాండిత్యమును సంపాదించెను. ఆ కాలమునఁ బారసీక భాష రాజకీయభాషగా నుండెను. అతడు దానినిగూడ నేర్చుకొని పాట్నాకుఁబోయి యరబ్బీ భాషనుగూడ నభ్యసించి స్వయముగా 'కొరాను' జదివి యర్థముచేసి కొనఁగల్గెను. పండ్రెండవ యేటఁ గాఁశీ నగరమున కేగి సంస్కృతముఁజదువ మొదలుపెట్టెను. దాని తోఁబాటు వేదశాస్త్రములను నేర్చుకొనగడంగెను. అతఁడు కాశీలో నుండగా హిందువు లందఱు ననేక దేవతా విగ్రహ ములను బూజించుట చూచెను. దేవుఁడొకఁడేయని వేదములు ఘోషించుచుండ నీ దేవత లంచెరెవరు? వీ రందఱిట్లేల యారాధించుచుండిరి? నిరాకారుఁడగు దేవుని పేర నీవిగ్రహ

రాధనమేమి? అను ప్రశ్నపరంపర రామమోహనుని హృదయమునందు బయలు దేరెను. ఉపనిషత్తులలోను, మహమ్మదీయుల ప్రమాణ గ్రంథమగు కొరానులోను బేర్కొనఁబడిన యేకేశ్వరోపాసన యతని హృదయమున బాగుగా నాటుకొనెను. మఱియు నొక్క విగ్రహారాధన విషయము ననే కాక నాఁడు హిందూమతమునందు ప్రబలముగా నున్న వర్ణవిభాగము, సహగమనము, మున్నగునవి యతనికిఁ గంటకింపుగా నుండెను. పదునాఱవయేటనే రామమోహనుఁడు వంగభాషలో విగ్రహారాధన కూడదనుచు నొక గ్రంథము వ్రాసెను. వంగభాషలో నిదియే మొదటి వచన గ్రంథము. హిందువుల మతసిద్ధాంతములకును వారుచేయు విగ్రహారాధనాది కృత్యములకును నేమియు సంబంధము గన్పట్టుట లేదని యాతఁడా గ్రంథమునం దుద్ఘాటించి ప్రజలను సన్మార్గమునకు మరలింపఁజూచెను.

విద్యాపూర్తియైనంతనే రామమోహనుఁడు కాశీకాపురి నుండి తిరిగి స్వగ్రామమునకువచ్చెను. అతఁడు వెనుకటి రామమోహనుఁడు కాఁడు. అతని యభిప్రాయము లన్నియుఁ బూర్తిగా మారిపోయెను. అతని తండ్రి యభిప్రాయములకిప్పుడాతని యభిప్రాయములు కేవలము వ్యతిరేకము. సనాతనాచారపరుఁడును సంతత విగ్రహారాధన పరుఁడును నగు రమాకాంతునకు గుమారుని సిద్ధాంతములు నచ్చలేదు. పైపెచ్చతనికిఁ గుమారునిపై గల్గిన కోపమునకు మేరలేదు. రామమోహను నింటినుండి వెడలనడచుటయే తత్పర్యవసానము. అప్పటికతనికిఁ బదునాఱేండ్లకన్న నెక్కువ లేవు. ఐనను ధైర్యసాహసములకుఁ గార్యదీక్షకుఁ గొఱంతలేదు. అట్లు గృహ

నిష్కాసితుఁడైన రామమోహనుఁ డనాదృతుఁడై కొంతకాల
మటునిటు తిరుగుగాఁడి పలుకష్టములనుభవించెను. పైసయైనను
జేఁతలేదు. ఎన్ని యిక్కట్టులనుభవింపవలసి వచ్చినను దిరిగి
యింటికిఁ బోవలెననితలపెట్టలేదు. నిజసిద్ధాంతముల మార్చు
కొంటినని తండ్రికి నివేదించి క్షమాభిక్ష యర్థింపఁదలంపలేదు.
తనమార్గమే ఋజుమార్గమని యాతని దృఢవిశ్వాసము.

ఒకనాఁడు కొంతమంది సాధువులు హిమాలయ
యాత్రకుఁబోవువారు రామమోహనునకుఁగనిపించిరి, అతఁడు
మిక్కిలి సంతసించి వారితోఁజేరి కొంతవఱకు బోయెను.
కొంతదూరము పోవుసరికి అక్కడికి టిబెట్టు దగ్గఱలో నున్న
దని విని వారిని విడిచిపెట్టి యచ్చటికి జూడఁబోయెను. టిబెట్టు
దేశపుఁ బ్రజల యాచారవ్యవహారములు నచ్చకుండెను.
అక్కడఁ జూడనతనికి విగ్రహారాధన కనఁబడెను. అదికూడదని
యుంచుట హృదయంగమముగా వారికి బోధించెను. కొంత
మందికది యుక్తముగాఁ దోఁచినను గొంతమందికిఁ గోపము
వచ్చెను. కొందఱతనిని జంపుటకుఁగూడఁ బ్రయత్నించిరి.
పైసమయమునఁ గొందఱు టిబెట్టు దేశపు స్త్రీలతనిని రక్షించిరి.
అతఁడు టిబెట్టులో నున్నప్పుడు పాళీభాషలోనున్న బౌద్ధమత
గ్రంథముల నన్నిటిని జదివెను. అక్కడనుండి హిమాలయ
ప్రాంతములకుఁబోయి దాదాపు మూఁడుసంవత్సరము లచ్చట
దిరుగాడి తదనంతరము వంగదేశమునందలి స్వగ్రామమునకు
దిరిగివచ్చెను. మొట్టమొదటఁ దలిదండ్రులతోఁ గలహించి
వారిచే నింటినుండి వెడలఁగొట్టఁబడినను వారినిఁజూచిచాల
కాలమగుటచే నొకసారి వారిని చూడవలెనను కోరిక యాత
నికి మిక్కుటముగానుండెను. తండ్రియాగ్రహముకూడఁ గొంత

యుపశమించెను. అందుచే నతఁడు కుమారుని కౌగలించుకొని యాశీర్వదించెను. రామమోహనునకప్పటికిరువది యేండ్లుండును. అప్పటినుండి నాలుగేండ్లింటికడ నేయుండెను. అప్పుడింగ్లీషు గ్రహించి, గ్రీకు, లాటిను, హీబ్రూ భాషలలో మంచిపాండిత్యము సంపాదించెను. హిందూమతమునుగురించి యింకను దెలిసికొనవలెనని మరియొకసారి కాశీనగరమునకుఁ బోవసంకల్పించెను. తన యభిప్రాయములు దన తల్లిదండ్రులకుఁ బూర్తిగా నచ్చలేదనియు, నచ్చునట్లు చెప్పగలిగినస్థితికి దానువచ్చుటకింకను గృషి యవసరమనియు నతఁడు గ్రహించెను. రెండవతూరి కాశీ వెళ్లినప్పు డక్కడఁ బండ్రెండు వత్సరములుండెను. అమూలాగ్రముగా హిందూమత గ్రంథములన్నిటిని జదివెను.

1803 సం॥లో రామమోహనుని తండ్రి చనిపోయెను. ఆస్తిపాస్తులంతగా లేవు. ఉన్నకొంచెము నన్నగారగు జగన్మోహనుని హస్తగతమయ్యెను. రామమోహనుని కేమియు విచారము కలిగినదికాదు. స్వయముగా ధనమార్జించుకొనఁగలనను ధైర్యమతనికిఁ బూర్తిగాఁగలదు. అందుచేఁ బ్రయత్నముచేసి రంగపురమునందుఁ గలెక్టరుగాఁ బనిచేయుచున్న డిగ్బీదొరగారి దగ్గఱ నొకగుమాస్తా యుద్యోగము సంపాదించెను. దానిలోఁ బ్రవేశించుదినమున నతఁడా దొరగారితో 'అయ్యా, మీరు నాకొక్కటి యనుగ్రహింపవలయును. అట్లొనర్తుమని వాగ్దానముఁ జేసినచో నే నీయుద్యోగముఁ జేయుదును. లేకున్న జేయజాలను' అని పల్కెను. డిగ్బీదొర తప్పకయట్లేయొనర్తునని హామీయిచ్చెను. అంత రామమోహను డతనిని జూచి మరియేమియుఁగాదు వినుఁడు. నేను మంచిగౌరవమర్యాదలు గల కుటుంబమునందు జన్మించితిని. భారతీయుడను. నా కాత్మ

గౌరవము నొందు. అదిలేని తక్కిన యుద్యోగులను జూచి నట్లు నన్నుఁ జూచిన నేనొప్పుకొనను. నన్నుఁ బ్రత్యేకగౌరవముతోఁ జూచిన నే నీయుద్యోగమునందుఁ బ్రవేశించి చేయుదును" అని చెప్పెను. డిగ్బిదొరగా తతని ధైర్యమునకును, నాత్మగౌరవ విశ్వాసములకు మెచ్చుకొని యట్లే గౌరవముగాఁ జూడఁ గలవాఁడనని యతనికి లిఖిత పూర్వకమైన వాగ్దానమొసంగెను. మొట్టమొదట స్వల్ప వేతనముపై రామమోహనుఁడు చేరినను దనబుద్ధిచాకచక్యముచేఁ గ్రమక్రమముగాఁ బై యధికారుల యాదరాభిమానములకుఁ బాత్రుఁడై యనతికాలముననే జిల్లా సిరస్తాదారు పదవి స్వీకరించెను.

1811 సం॥లో రామమోహనుని యన్నయగు జగన్మోహనుఁడు చనిపోయెను. ఆదినములలో సహగమన దురాచారము మిక్కుటముగా నుండెను. దానినే 'సతి' యనికూడ వ్యవహరింతురు. జగన్మోహనుని భార్యను బలవంతముగా సహగమనముఁ జేయించిరి. హృదయ విదారకమైన యాదృశ్యము నతఁడు గన్నులార చూచుట తటస్థించెను. తదాది యతని హృదయమునందు మతసంబంధమైన యనేక ప్రశ్న పరంపరలు బయలుదేరెను. ప్రపంచ మతముల కన్నిటికిని శిరోమాణిక్యమనఁదగు హిందూమతము నందిట్టిలోపములుండుట యతని కెంతయు బాధకలిగించెను. 1813 సం॥లోఁ దాను జేయుచున్న ప్రభుత్వోద్యోగమునకు స్వస్తిచెప్పి సంఘమును మతమును నుద్ధరించుటకుబూనుకొనెను. ముఖ్యముగా సహగమన దురాచారమును రూపుమాపినఁ గాని తాను నిద్రింపకూడదని ప్రతినపట్టి యద్దానికై జీవితమునుధారవోయ సంకల్పించుకొనెను. 1814 సం॥లోఁ గలకత్తానగరమునందుఁ బ్రవే

శించెను. అనేక గ్రంథములను వ్రాసెను. 1814 సం॥లో వేదాంత శాస్త్రము నొకదానిని వంగభాషలోనికిఁ బరివర్తన జేసెను. 1816-17 లో నుపనిషత్తుల నాంగ్ల వంగ భాషల లోనికిఁ దర్జుమా చేసెను. సహగమనమును గుఱించి రామ మోహను డెంతపాటు పడినను దానినిఁబూర్తిగా నతఁడరికట్ట లేకపోయెను. 1815-28 సం॥ల మధ్యకాలమున నొక్క కల కత్తానగరములోనే యైదువేలమంది సహగమన మొనర్చిరి. గ్రంథముల వ్రాసియు, నుపన్యాసము లిచ్చియు, బ్రయోజ నము లేదని గ్రహించి రామమోహనుడు 'సహగమన నిషేధ శాసనము' అనునొక శాసనమును బ్రభుత్వముచేఁ జేయింప వలెనని నిశ్చయించుకొనెను. ప్రభుత్వముతో నావిషయమై యుత్తర ప్రత్యుత్తరము జరిపి యొత్తిడి గల్గించెను. అతని వాదమునందు ధర్మము, న్యాయము, భూతదయ యుండుటచే నప్పుడు గవర్నరు జనరలుగానున్న విలియంబెంటింకు ప్రభువు 1829 సం॥ డిశంబరు 4 వ తేదీన వితంతువుల గాల్చ కూడ దని శాసించెను. ఆ శాసనము దేశమునందలి సనాతనాచార పరాయణులకుఁ గష్టముగా నుండెను. వారు బెంటింగునకుఁ దమయసమ్మతినిఁ దెలియజేసిరి. కాని లాభము లేకపోయెను. ఇంగ్లండులోని పార్లమెంటునకుఁ గూడ నప్పీలు చేసిరి. రామ మోహనుఁడవసరమైనచో నావిషయమై ఇంగ్లండునకుఁ గూడ బోయి యాశాసనముయొక్క యావశ్యకత నచ్చటి వారికి నిరూపించుటకు సిద్ధపడెను. 1832 సం॥ జులై 11 వ తేదీన బ్రిటిషు పార్లమెంటుకూడ నా సహగమన నిషేధ శాసనము నామోదించెను. రామమోహనుని కృషి ఫలించెను.

అన్నపోయినతరువాత రామమోహనుడే ఇంటికి పెద్ద యయ్యెను. గృహనిర్వహణభార మతనిపైఁ బడెను. జగన్మోహనుని యాస్తి రామమోహనునకు సంక్రమించుట తల్లికిష్టము లేకపోయెను. అందుచే నామె కొడుకుపై నొక యభియోగముఁ దెచ్చెను. న్యాయస్థానమునఁ గొంతకాలమా వ్యవహారము నడచెను. చివరకుఁదల్లియే యోడిపోయెను. ఇంత చేసినను రామమోహనునకుఁ దల్లిపై గోపము రాలేదు. ఆమె యజ్ఞానమున కెంతయుఁ జింతించెను. ఆమె చేయు విగ్రహారాధనమునకును, మూఢవిశ్వాసములకును, మౌర్ఖ్యమునకును లోలోనఁ గుందుచుండెడివాఁడు. విగ్రహారాధన మానుమని యాంతడెన్నియో సారులు దల్లికి బోధించెను. అదియామె చెవులకెక్కలేదు. అసలామె రామమోహనుని ద్వేషించుట కదియే కారణము. కొంతధనము సంపాదించి యతఁడు స్వగ్రామము నందొక గృహమునిర్మింపవలెననియనుకొనెను. కాని తల్లి పనిచ్చినది కాదు. అందుచే నతఁడు రఘునాథపురమను [illegible] గ్రామము నందొక యిల్లు కట్టుకొనియచ్చటఁ గాలక్షేపముఁ జేయ మొదలిడెను.

ఆ కాలమునందలి యాచారమునకనుసరించి రామమోహనునకు 9 వ యేట తల్లిదండ్రులు వివాహము చేసిరి. కాని మొదటిభార్య కొలదిదినములకే గతించెను. తరువాతఁ గొన్ని మాసములకే తల్లిదండ్రులు అతని కిద్దరు కన్యలను దెచ్చి వివాహము జేసిరి. బహుభార్యాత్వ మాకాలమునఁ బరిపాటియే. రామమోహను డాయిరువురు భార్యలతోను రఘునాథపురమునందుఁ గాపురముచేయుచుండెను. అతని మతాభిప్రాయములా యూరివారిలోఁ జాలమందికి నచ్చినవి కావు.

అందుచే వారతనిననేకకష్టములపాలుచేసిరి. రాత్రివేళ నమేధ్యము, రాళ్లు, బొమికెలు యింటిపై విసరివేసెడివారు. ఎన్ని చేసినను రామమోహనుఁడు ధైర్యమును వీడలేదు. శాంత భావములతో నన్నిఁటిని సహించెను.

రామమోహనునకు పాశ్చాత్యవిద్యపై నెక్కువయభిమానము. ఆకాలమునఁ బ్రభుత్వము మన దేశము నందున్న సంస్కృతము, అరబ్బి, పారశీకము మొదలగు దేశభాషలనే ప్రోత్సహించుచుండెడిది. కాని రామమోహనునివంటిమహనీయుల యభిప్రాయముల కనురూపముగాఁ బ్రభుత్వముఁ పాశ్చాత్యవిద్యావిధానమును దేశమునందుఁ బ్రవేశపెట్టెను. 1817 సం॥లో రామమోహనుఁడే యప్పుడు గవర్నరుజనరలు గానున్న ఆంహార్స్టు ప్రభువు సహాయమున నిరువురు దొరలతోఁగలసి యాంగ్లవిద్యావ్యాప్తికి దేశమునందనేక కళాశాలలు స్థాపించెను. 1815 సం॥లో నాత్మీయసభ Socity of friends అనునొక సంఘమును నెలకొల్పెను. 1817 సం॥లో మత విషయములను జర్చించుటకునుఁ వేదాధ్యయనమునకును గలకత్తా నగరమునందు వేదమందిరమను నొక పాఠశాలను స్థాపించెను. అన్ని మతముల వారికిని దానిలోఁబ్రవేశముగలదు. మత సాంఘికవిషయము లన్నియు నచ్చట ముచ్చటింతురు. కొందఱు క్రైస్తవ సోదరులురామమోహనునిఁజూచి 'మీరు మాచర్చికిరండు. అక్కడఅందఱముగలసిప్రార్థనచేసి కొందము' అని కోరిరి. రామమోహనుఁడువల్లెయనియట్లొనర్చెను. కొన్ని దినములట్లు నడచెను. కాని తన వేదమందిరమునకు వచ్చినంత మంది యాచర్చికి వచ్చుటలేదు. అతని స్నేహితులగు తారాచందు చక్రవర్తి, చంద్రశేఖర్ అనువారు 'మనకుఁ బ్రత్యేక

ప్రార్థనామందిర ముండవలెను. మనము వారిచర్చికిఁబో నేలఁ?' అని పల్కిరి. రామమోహనుఁడు వారు వచించినది సత్యమే యనిగ్రహించి కలకత్తాలో నొక యిల్లద్దెకుఁదీసికొని దానిలో 1828 సం॥ ఆగష్టు 20 తేదీన 'బ్రహ్మసమాజము' అను పేర నొకసమాజమునుస్థాపించెను. దానిలో సర్వమతములవారును సభ్యులుగాఁగలరు. ఆ సమాజమువారు 'సంబంధ కౌముది' యను నొక పత్రికనుగూడ నడుపసాగిరి. దానిలో బ్రహ్మ సమాజ మతసిద్ధాంతములు విపులముగాఁ బ్రకటింపఁబడుచుండె డివి. మానవులందఱు సమానులనియు భగవంతుఁ డందఱకుఁ దండ్రియనియు, సర్వమతములకును లక్ష్యమొక్కఁడేయనియు రామమోహనుఁ డుద్ఘోషించెను. అతఁడు పెక్కుతావులయం దుపన్యాస వేదికలపై సర్వమత సమన్వయము సరసముగాఁ జేసిచూపెడివాఁడు. ఏసుక్రీస్తు మతగురువుగాని, దేవునికుమారుఁడుగాఁడని యతఁడు 1820 సం॥లో వంగసంస్కృతభాష లలో వ్రాసిన గ్రంథముల వలనఁ గ్రైస్తవులలో నతనికిఁ గొందఱు విరోధు లేర్పడిరి. వారు బ్రహ్మసమాజ మతమును రూపుమాపుటకై ప్రయత్నించిరి. వారు 'చంద్రిక' యనునొక పత్రికను గొంతకాలమునడిపిరి రామమోహనునిసిద్ధాంతము లను దీవ్రముగా ఖండించిరి. అయినను నతఁడావంతయు లక్ష్యముఁ జేయలేదు. దృఢవిశ్వాసముతో నాత్మసమ్మతమగు బ్రహ్మమతమును బ్రచారముచేయుచునే యుండెను.

ఇట్లుండ 1830 సం॥లో ఢిల్లీలోఁ బాలకుఁడుగా నున్న మొగలు చక్రవర్తికి దూర్పిండియా వర్తక సంఘము వారికిని నొక తగాదావచ్చెను. అప్పుడు మొగలు చక్రవర్తియగు రెండవ యక్బరునకు గంపెనీవారు చక్రవర్తి బిరుదమును

దీసివైచిరి. అది యతఁడవమానముగా భావించి యెట్టు
లేని నాబిరుదమును నిలువఁబెట్టుకొనవలెనని సంకల్పించు
కొనెను. అందుచేత ఆ మొగలుచక్రవర్తియే రామమోహనునకు
రాజా యను బిరుదము నొసంగి గౌరవించి కావలసినంత ధన
మొసంగి తనతరఫున పార్లమెంటువారితో మాటాడిరమ్మని
యింగ్లండునకంపెను. సహగమనమునుగుఱించి పార్లమెంటు
వారి నిజమైన యభిప్రాయ మెట్లున్నదో తెలిసికొనుటకును,
1833 సం॥న పార్లమెంటువారీయనున్న ఛార్టరు హిందూ
దేశమున కుపయోగపడునట్లు చూచుటకును గూడ నవకాశము
లభించెనుగదా యని రామమోహనుఁడువ్విళులూరెను.

ఆ దినములలో సముద్రప్రయాణముఁ జేయుట తప్పుగా
భావింపఁబడుచుండెను. ఇంగ్లండునకు పోవువానికి సంఘబహిష్కారణమే
శిక్ష. రామమోహనుఁడు తాను బ్రాహ్మణుఁడయ్యు నంధ
విశ్వాసములకు లొంగనివాఁడగుటచే నించుకయు సంశయింపక
యొక యోడలో నింగ్లాండునకుఁ బ్రయాణమయ్యెను. త్రోవలో
నతనికొక ఫ్రెంచివారి యోడ కనఁబడెను. రెండును దగ్గ
ఱగుటచే నతఁడు తనయోడలోనుండి దానిలోనికి 'జూడ'
బోయెను. దురదృష్టవశమున నట్లొనర్చుటలోఁ గాలువిరుగఁ
బడెను. తిరిగి యతఁడు తనయోడ లోనికివచ్చి కూర్చుండెను.
అప్పుడు తగిలిన దెబ్బలవలననే యతఁడు చాలకాలము
కుంటుచు నడచెడివాఁడు. అతఁడు 1831 సం॥ ఏప్రియల్ 8 వ
తేదీన లివర్‌పూలు చేరెను. అక్కడనుండి లండను నగరము
నకుఁ బోయెను. అక్కడఁ దూర్పిండియా వర్తక సంఘమువా
రతని కఖండస్వాగత మొసంగి గొప్ప విందుగావించిరి.

రామమోహనుఁడు వచ్చినపనులన్నియుఁ బూర్తిచేసి కొనుచు లండనునగరమునఁ గొన్ని దినము లుండెను. సార్వ భౌముని దర్శించెను. అక్కడనతనికిఁ బలువురు మిత్రులేర్పడిరి వారితో నాంగ్లభాషలో నతఁడు చక్కఁగా మాటలాడ దొడఁగెను. ఆభాషల నతఁడు గొన్ని కొన్ని గ్రంథములను గూడ రచించెను. ఇఁక స్వదేశమునకు మరలి రావలయునని యనుకొనుచుండగా నతని యారోగ్యము చెడిపోయెను. బ్రిస్టల్ నగరమునకు వెళ్లి విశ్రాంతి తీసికొనుడని వైద్యులతనకు సలహా చెప్పిరి. కార్పెంటరను నొక మహాశయుఁడతని నచ్చటకుఁగొని పోయెను. 1833 సం॥ సెప్టెంబరు 10వ తేదీన రామమోహను నకు జ్వరము తగిలెను. ఎందఱో గొప్పగొప్ప వైద్యులువచ్చి పరిశీలించిరి. ఎన్నియో యౌషధములిచ్చిరి. ప్రయోజనము లేకపోయెను. ఆనగరముననే 1833 సెప్టెంబరు 27 వ తేదీన రామమోహనుఁడు భౌతిక దేహమును వీడి కీర్తిశరీరమును దాల్చెను. అతని స్నేహితుఁడు ద్వారకానాధ ఠాకూరతనికై యొక సమాధిని గట్టించెను.

ఆగర్భ శ్రీమంతుడై జనించియు, నాత్మమత వ్యాపన మునకై సర్వసంగ పరిత్యాగ మొనర్చి, విగ్రహారాధనము, సహగమనము, బహుభార్యాత్వము మున్నగు సంఘగత దోషముల రూపుమాపి, దేవుఁడొక్కడేయనియు సన్నిమత ములకును లక్ష్యమొక్కఁడేయనియు నిరూపించి యాంగ్ల విద్యాభివృద్ధికై యనేకకళాశాలలు స్థాపించి; యాంగ్ల, వంగ, సంస్కృత పారశీ కాద్యనేక భాషలలో ననేకమైనయుద్గ్రంథ

ముల రచియించి విశ్వకల్యాణమునకై రామమోహనుఁడు నిజ జీవితమును ధారవోసెను. హిందూమత సంస్కర్తలలో నతఁడే ప్రథమగణ్యుఁడు.

## 2. రామకృష్ణ పరమహంస

వంగ దేశమునందు కమార్పుకర యను నొక గ్రామము గలదు. అందుఁ గుదీరాం ఛటర్జీ యను నొక సామాన్య గృహస్థుఁడు వాసముఁ జేయుచుండెను. అతని భార్యయు నను కూలవతియై యుండెను. వారికి 1833 సం॥ ఫిబ్రవరి 18 వ తేదీన నొక కుమారుఁడుదయించెను. వారీశ్వర భక్తులగుటచే నాకుమారునకు గంగాధరుఁడని నామకరణం బొనర్చిరి.

అదియేటి పూర్వవాసనా ఫలమోగాని గంగాధరునకుఁ జిన్ననాటి నుండియు ధ్యాననిష్ఠ, ప్రకృతి సౌందర్య తన్మయత మున్నగు మహాయోగిగుణములలవడెను. అతనియాటపాటలు సైతము భక్తి సంబంధములయినవియే. అతని కేడవయేట నతని తండ్రి చనిపోయెను. అసలే సామాన్య కుటుంబము. సంపాదించు నాథుఁడు మృతిఁబొందెను. ఇఁక నా సంసారశకట మెట్లు నడచును! దారిద్ర్య దేవత కుదీరాముని భార్య శిరముపై నెక్కి కూర్చుండి యామెసంసారమును బలు వెతల పాలు చేసెను.

గంగాధరుని యన్నయగు రామకుమార ఛటర్జీ వయసు నకుఁ జిన్నవాఁడయ్యుఁ దల్లి దమ్ముల, బోషించుటకై పడుపాట్లు

చూచి సహింపఁజాలక తానే యేదియేని నుద్యోగముసేసి సంసార నిర్వహణ మొనర్పవలెనని కృతనిశ్చయుఁడయ్యెను. అందుచే వెంటనే యతఁడు కలకత్తా నగరమునకుఁబోయి యచ్చట నొకబడిలో నుపాధ్యాయుఁడుగా బనిచేయఁ దొడంగెను. తల్లియు గంగాధరుఁడును దూర్పుకర యందే యుండిరి. రామకుమారుఁ డింటికప్పుడప్పుడు డబ్బుపంపుచుండెడివాఁడు.

గంగాధరునకుఁ గూడ బదునాఱు వత్సరములు వచ్చెను అతఁడు దనకుసహాయముగా నుండఁగలఁడని రామకుమారుఁ డతనిని గూడఁ గలకత్తాకు రమ్మని కబురంపెను. కాని గంగాధరుఁడు మొదటదానికి సమ్మతింపలేదు. నాలుగు వత్సరములల్లే యున్నయూరును గన్నతల్లినివిడువక దారిద్ర్య బాధ ననుభవించి చివరకు విసిగి కలకత్తా నగరమునకుఁ జేరుకొనెను.

గంగాధరుఁడు గలకత్తాకుఁ జేరినవేళావిశేష మెట్టిదో కాని యచ్చట నాతని యదృష్టమువలన నొకధనికురాలి సరిచయ భాగ్యము లభించెను. ఆయమ్మ గంగానదీతీరమునందలి దక్షిణేశ్వరమను చోట కాళికాదేవికొక దేవాలయముఁ గట్టించెను. దానికి నర్చకుఁ డొకఁడు కావలసి వచ్చెను. 1855 సం॥ లో నా పనికి రామకుమారునకుఁ గబురంపెను. అతఁడును నా పనికి సమ్మతించి యా గుడిలో నర్చకుఁడుగాఁ బ్రవేశించెను. కాని యొక్కసంవత్సరముననే యాతఁడుమృతి నొందెను. ఆధనికురాలా యర్చకత్వమును గంగాధరునిఁ జేయుమని కోరెను అతడును సహజముగా భక్తి రస పూరితుఁడగుటచే నామెమాట కెదురాడక వెంటనే సమ్మతించి యా యాలయమునందుఁ బనిచేయుచుండెను.

గంగాధరుఁడు దక్షిణేశ్వరమునఁ గాళికాలయమున నర్చకుఁడుగాఁ బ్రవేశించు నప్పటి కతనికిరువది యేండ్లుండును. ఇట్లు ప్రయత్నముగా నతని సహజాభిరుచి కనుగుణమగు నుద్యోగము లభించినందుల కాతఁడెంతయు సంతసించి యహర్నిశములును ఏదేక ధ్యానముతోఁ గాళికాదేవి నుపాసించుచుండెను. ఒకొక్కప్పుడు గంటలకొలది దేహాభానము లేక పడియుండెడివాఁడు. మఱి యొకప్పు డతఁడు దేవి ప్రత్యక్షమైనట్లుగా నామెతో నేవియో మాటలాడెడివాఁడు. వేరొకప్పు డతఁడానందాతిరేకమున తాండవ మొనర్చెడివాఁడు. కొండొకనాఁ డతఁడు కాళికామూర్తిలో నైక్యము కావలెనని యభిలషించెడివాఁడు. మనసారఁ దలఁచినప్పుడెల్ల గాళికాదేవి యతనికిఁ బ్రత్యక్షమగుచుండెడిది. ఒకమారితనిని బరీక్ష సేయుటకై కాళికాదేవి యెంతపిలిచినను గనఁబడలేదట. వెంట నేయతడు నిరాశచేసికొని, 'ఛీ యిక నాజీవితము వ్యర్థము' అనియావిగ్రహము నెదుటఁ దత్క్షణమే యాత్మహత్యఁ జేసికొనుటకుఁ గడంగెను. అతని సాహసమునకు దేవి వెఱగంది సాక్షాత్కరించెను. అతని భక్తి యపురూపము. అతని హృదయము నిష్కళంకము అతఁడెంతయో శారీరక క్లేశము ననుభవించెను. నెలల తరబడి నిద్రాహారములే యుండెడివికావు. ఒకమారాఱు నెలలపాటతని కన్నులెంత ప్రయత్నించినను మూఁతపడలేదట. చూచుచున్నవాఁడు చూచుచున్నట్లే యుండెను. శరీరమంతయు మండుచున్నట్లు గన్పడెను. ఒకొక్కప్పుడు దేహమునుండి రక్తధారలు సైతము స్రవించెడివి. వైద్యులెందఱో వచ్చి పరీక్షించిరి. శారీరకరోగ మేదియుఁ

పొడగట్టినదికాదు. అయినను నతఁడట్లుండుటకుఁ గారణము
వారికి బోధపడలేదు.

గంగాధరుని శరీరస్థితిఁజూచి యతని కర్చకత్వము
నొసఁగిన ధనికురాలు మిక్కిలి జాలిపడి భక్తిభావముచే
నతఁడు పిచ్చివాఁడై శరీరము మఱచు చున్నాఁడని తలంచి
'గంగాధరా' నీవు కొంతకాల మింటికిఁబోయి విశ్రాంతి తీసి
కొనుము. వలయు ధన మొసఁగెదను. మరల వచ్చెదవుగాక!
యని 1859 సంIIలో నతని బుజ్జగించి యింటికంపివేసెను.
ఇంటికి వెళ్లినమాటయేకాని హృదయమంతయుఁ గాళికా
లయమునందే యుండెను. అతని భక్తి భావమునకుఁ గొఱంత
లేదు. అప్పుడప్పుడొక విధమగు మూర్ఛవలె వచ్చుచుండె
డిది. ఏమిచేయుటకును దల్లికిఁ దోచలేదు. పెండ్లిచేసినచో
నతఁడు చక్కఁబడునని యిరుగు పొరుగు వారామెకుఁ జెప్పు
టచే నా మాటల ననుసరించి తల్లి యొకనాఁడు గంగాధరుని
జూచి 'కుమారా' వివాహమాడుదవా? యని ప్రశ్నించెను.
అంత గంగాధరుఁడు దల్లినిఁజూచి 'అమ్మా! యిచ్చటికినొక
సమీప గ్రామములో శారద యను నైదు సంవత్సరముల
బాలికకలదు. మీరుపోయి చూడుడు. ఆ పిల్ల నాకు భార్య
కాగలదు' అని చెప్పెను. తల్లియుఁ గొందఱిరుగు పొరుగు
వారునుబోయి చూడ నట్లే యొక గ్రామమునందు శారద
యను బాలిక యొకర్తుక యుండెను. వారా పిల్లను దెచ్చి
గంగాధరునకుఁ బెండ్లి యొనర్చిరి. యుక్తవయస్సువచ్చు
వఱకు నబ్బాలిక పుట్టినింటనే కాలముఁ గడపెను.

గంగాధరుఁ డింటికడఁ గొన్నినాళ్లుండి మరల మనస్సు
దక్షిణేశ్వరాలయస్థలమగు కాళికామూర్తిపైఁ దిరుగుటచే

నచ్చటికి రెండవ పర్యాయము బయలుదేరెను. అచ్చటికిఁ బోయి యజమానురాలిని దర్శించి యాలయమోపవిష్టుఁడై యథాపూర్వముగా ధ్యాననిష్ఠలో మునిగెను. కాళికా దేవియు నాతఁడు పిలిచినదే తడవుగాఁ బ్రసన్నమగుచుండెను. గంటలకొలది యతఁడామెతో సంభాషించెడివాఁడు. సమాధి నిష్ఠలో నతఁడు దినముల కొలఁది యుండెడివాఁడు. ఆత్మసంబంధములగు నిగూఢ రహస్యము లెన్నియో యతని కవగాహన మయ్యెను. ఇంకను దాను దెలిసికొన వలసిన జీవిత రహస్యము లెన్నియో కలవనియు వానిని దెలిసికొనవలెననియు నుబలాటపడుచుండెడివాఁడు. ఒకనాఁడతఁడు గంగానది యొడ్డునఁ గూర్చుండి యుండఁగా నదిలో దూరము నందతని కొకనావ కనఁబడెను. అది యతని వైపునకే వచ్చుచున్నట్లుండెను. ఆపడవ యొడ్డుచేరినంతనే యొక దివ్యసుందరి దానిలో నుండి బయటికి వచ్చి గంగాధరు నవలోకించి కుమారా! నీ కొఱకు నేను జాలదినముల నుండియు నన్వేషించుచుంటిని. నేఁటికి నా శ్రమ ఫలించినది. నీవు నాకంటఁబడితివియని యాదరము మీఱఁబలికెను. గంగాధరుఁడామె నదివరకెన్నఁడును జూచియెఱుఁగఁడు. భగవంతునిఁ జేరుటకు సంబంధించిన తత్త్వ రహస్యము లెన్నియో యామెకుఁ దెలియును. ఆ రహస్యములను దెలిసికొనుటకు గంగాధరుఁడే తగినవాఁడని యాదివ్యాంగన వాని నతనికి బోధించెను. ఆమెయే యతనికిఁ తాత్త్విక విషయమునఁ బ్రథమ గురువు. ఆమె బోధ ముగిసినంతనే యదృశ్యమయ్యెను.

రామకృష్ణున కాత్మవికాసము గలిగెను. ఐహిక బంధములను దెగఁద్రెంపివేయ నిశ్చయించుకొనెను. ఉన్నస్వల్ప

ధనమును సద్వినియోగముఁ జేయఁదలఁచి బీదలకుఁ బంచి పెట్టెను. సన్యసించుటకు భార్యయొక్క యంగీకారము కావలెను. అందుచే నాతఁ డొకనాఁడు శారదను జూచి తన్ను వివాహ బంధము నుండి విడుదలగావింపుమని కోరెను.

ఆయమయు భర్త యుద్దేశము నెఱిఁగినది యగుటచే వెంటనే వల్లెయని నిజాంగీకారమును దెల్పి పుట్టినింటికిఁ బోయెను. ధన దార బంధముల రెంటిని త్రెంపివైచి మనో నైశ్చల్యముఁగల్గి తపోనిష్ఠ ప్రారంభించెను. మొట్టమొదట నొక సన్యాసియుఁ దరువాత 1864 సం॥లో శ్రీ టోటాపురి యను నొక గురువును గంగాధరునకు లభించిరి. వీరిరువురిలో రెండవగురు వొక దేశద్రిమ్మరి. ఐహికసుఖవిముఖుఁడు. బ్రహ్మ సత్యం జగన్మిథ్యయను విశ్వాసము గలవాఁడు. గొప్ప వేదాంతి. వేదాంతరహస్యము లాకాలమున నతనికిఁ దెలిసి నట్లెవరికిఁ దెలియవు. ఆమహాసీయుఁడు గంగాధరున కప్రయత్నముగా గురువై యనేక విషయములను బోధించెను. పాదరసమువంటి బుద్ధిగలగంగాధరుఁడు గురుబోధనల నన్నిఁటి నేక సంథాగ్రాహియై గ్రహించెడివాడు. ఐహిక సుఖవైముఖ్యమున గంగాధరుఁడు దనగురువు కంటెను నొక యడుగు ముందునకు గూడవైచెను. ఒక మూఁడాఱునెలల కాలము సమాధిస్థితిలో నిలచిపోయెను. దేహభావము లేకుండెను. అట్టి స్థితిలోనొక ఫకీరతనికడకువచ్చియతనికిఁబ్రాణావసానసమయ మాసన్నమయ్యెనని గ్రహించి నిజతపః ప్రభావమున నతనికి బునర్జీవుతునిగాఁ జేయఁదలంచి యతని యొడలా పాద మస్తకముఁ జేతితో నిమిరెను. గంగాధరునకు స్మృతికలిగెను. మామూలు స్థితిలోనికి వచ్చెను.

గంగాధరుఁడు కొంతకాలము దేశసంచార మొనర్చెను. తుద కొకనాఁడు స్వగ్రామమగు దూర్పకరకుఁ బోవలెనని బుద్ధిపుట్టి యచ్చటికిఁ బోయెను. తల్లియు బంధువులును నీతనిఁజూచి యాశ్చర్య చకితులైరి. అతని రాకవిని భార్య యగు శారదయు భర్తృ దర్శనాసక్తయై పుట్టింటినుండి యతనిఁజూడసరుదెంచెను. భర్తహృదయ మేమైనఁబరివర్తినఁ జెంది తన్ను స్వీకరించునేమో యనునాశయు నామెకుఁ గొంతకలదు. అందుచేఁ జక్కఁగా శృంగారించుకొని భర్త కడకేగి భక్తి పూర్వకముగా నమస్కరించెను. గంగాధరుఁడు నిజభార్యనుజూచి 'శారదా' నేను బ్రతిస్త్రీని తల్లివలె భావించుచున్నాను. నిన్నుఁగూడ నట్లే భావించుచున్నాను. అట్లుగాదునన్ను మీరుభార్యగా జూడవలసిన దేయనినీవునన్ను నిర్బంధింతువేని నిన్ను వివాహమాడితిని గాన నట్లే భార్యగాఁ జూచుటకుఁ బ్రయత్నింతును. దీనికి నీవేమందువు? అని ప్రశ్నించెను. శారదయు 'స్వామీ' మీ యిష్టప్రకారము కానిరడు. మీయానందమే నాయానందము. మీరు నన్నె దృష్టితోఁజూచినను సరియే. మీపాదసేవఁజేయుచు మీకడనే యుండుటకు మాత్రము నాకనుజ్ఞయిండు. అని ప్రార్థించెను. గంగాధరుఁ డందులకు సమ్మతించెను. శారదయు నతని మతము నేస్వీకరించి యతనికిఁబరిచర్య జేయుచు నతనితోడి దే లోకముగా జీవితముఁ గడుపుచుండెను. సహధర్మ చారిణిగా నుండుట యేకదా భార్యకుఁ బరమధర్మము.

1867 సం॥లో గంగాధరుఁడు మూఁడవ పర్యాయము దక్షిణేశ్వరమునకుఁ బోయెను. అక్కడ గొంతకాలముండి పుణ్యతీర్థసందర్శనాభిలాష తన్నుఁబ్రేరేప నటనుండి బయల్దు

చేరి కాశీ, ప్రయాగ, అలహాబాదు, మధుర, బృందావనము మున్నగు మహాక్షేత్రముల నన్నిటిని దర్శించెను. ఆయాప్రాంతముల యందున్న బీదల శోచ్యస్థితి జూచి చాల జాలి పడి యథాశక్తిగా వారికిఁదోడ్పడి మానవసేవయే మాధవసేవ యను న్యాయమును చాటించెను.

గంగాధరునకు మధుర బాబను నొక స్నేహితుఁడు గలడు. అతఁడు మిక్కిలి ధనవంతుఁడు. చాలభూవసతి కలవాఁడు. ఒకచిన్న జమీందారని చెప్పవచ్చును.ఒకసంవత్సరము వర్షములు లేక పంటలు పాడగుటచే రైతులందఱు వచ్చి మధురబాబునకుఁ దామీయవలసిన ధాన్యమీయలేమనియు క్షమింపుమనియుబ్రతిమాలుకొనిరి. గంగాధరుఁడప్పుడచ్చటనే యుండెను. వారెంత దీనముగాఁ బ్రార్థించినను మధురబాబొప్పుకొనుటలేదు. ఎట్లని ననుకొనిన ప్రకార మీయవలసినదే యని యాతఁడు వారిని నిర్బంధింపఁదొడగెను. అప్పుడు గంగాధరు డదిచూచి యాపేదరైతులపై జాలిపుట్టునట్లు మధురబాబునకు బోధించి యతఁడు వారిని క్షమించుటయే కాక వారికి దినుటకు వలయు ధాన్యాదికమునుగూడ నిచ్చునట్లొనర్చెను. ఈ విధముగా గంగాధరుఁడు చేసిన మహోపకారము లనంతము. దుఃఖితులకడకుఁబోయి వారి ననేక విధముల నోదార్చెడివాఁడు. 1883 సం॥లో మణిమల్లిక్ అను నొక ధనికుఁడు నిజపుత్ర మరణమునకు మిక్కిలిదుఃఖించుచుండెను. తనవంటివారి కెందరికో గంగాధరు డాత్మశాంతిఁ గల్గించెనని విని యాధనికుడు దక్షిణేశ్వరమునకుబోయి యతనిని దర్శించెను. అతని దర్శనమాత్రముననే యామల్లికుని దుఃఖమంతయు సూర్యోదయావసరమునవిరియు మంచువలె

సదృశ్యమయ్యెను. అవచాటముగా నతనికిఁగల్గిన ధైర్యోత్సాహములకు మేరలేదు. మహనీయుల దర్శనము కలికల్మషహరముగదా! సన్యసించినది మొదలు గంగాధరుఁడు రామకృష్ణపరమహంస యని వ్యవహరింపఁ బడుచుండెను.

ఆ రామకృష్ణుని ప్రతిభా ప్రభావముల వలన నతనికిఁ బలువురు శిష్యులేర్పడిరి. ఎవరు వచ్చినను నత డీవిధముగా బోధించెడివాఁడు. "ప్రతిప్రాణిలోను భగవంతుఁడున్నాఁడు. ప్రాణులన్నియు భగవత్స్వరూపములే. ప్రతివ్యక్తియు నాత్మాభివృద్ధికై పాటుపడవలెను. నీవు చేరవలసిన గమ్యస్థానము నెప్పటికైనను నీవు చేరఁగలవు. తొందరపడకూడదు. అట్లని యూరకుండనుగూడదు. నీ విధి నీవు నిర్వర్తింపుము. ఫలము దైవమునకు వదలుము. నళినీదళ సంస్థిత కంకణము పగిదినీ వైహిక విషయమునకంటుకొనక జీవింపవలెను. పుష్పమునందలి మధువును పుష్పంధయము దానిలోఁ జిక్కుకొనకుండ గ్రహించినట్లు మనుజుఁడు ప్రాపంచిక సుఖానుభవము నందవలెను. అంతియేకాని యదియె శాశ్వతమని భ్రమసి దానిలోఁబడి ప్రమగ్గిపోఁగూడదు. ఐహిక బంధములకుఁ బురిపెట్టి గట్టిచేయగూడదు. ప్రతిమానవుఁడును సర్వమతసమానభావమును గలిగియుండవలెను. అన్నిమతములును బోధించునది యొకటియే" ఇదియే యామహనీయుని బోధామృతసారము. చెప్పుటయేకాక చెప్పినట్లాచరించి లోకమునకు జూపిన మహాపురుషుఁడు రామకృష్ణుఁడు. అతఁడు మహమ్మదీయ మత సిద్ధాంతములను బూర్తిగా నవగాహన మొనరించుకొనుటకై యాతడు మూఁడు దినము లామతము నవలంభించెను. అట్లే క్రైస్తవ మతమునుగూడ స్వీకరించి యా

మత ప్రమాణ గ్రంథము లన్నిటిని జదివెను. పైనఁ జెర్కొనిన రెండు మతములును హిందూమత సిద్ధాంతముల కేమాత్రము భిన్నములు గావని యతఁడు గ్రహించి సరసముగా సమన్వ యముఁజేసి చూపెను. ప్రపంచ మతములన్నిటికిని గమ్యస్థాన మొక్కటియే. మార్గములు మాత్రము భిన్నముగాఁ గనబడు చున్నవి యని యతఁ డందఱకు బోధించెను.

రామకృష్ణుఁడాత్మ సిద్ధాంతములను జగద్విదితముఁ జేయఁదలంచి పలుతావుల గంభీరోపన్యాసము లొనరించెను. ప్రసిద్ధ పత్రికలలోఁ బ్రకటించెను. ఈశ్రమకు నిత్యము నతడు చేయు ప్రాణాయామాది యోగసాధన క్లేశము తోడయ్యెను. శరీరమంతయు గృశించెను. 1884 సం॥లో నొక మారాతడు సమాధిస్థితిలో నుండగాఁ గ్రిందపడి పోయెను. అతని యెడమచేతికి బలమైన దెబ్బతగిలెను. అది యతనికి, జాల బాధఁగలిగించెను. కాని ధ్యాననిష్ఠ మాత్రము వీడలేదు. ధైర్యోత్సాహము లావంతయుఁ దగ్గలేదు. 1885 సం॥ ఏప్రెల్ నెలలో నొకనాఁడు తెల్లవారు నప్పటి కతని గొంతుక వాచెను. ఆనాఁడతనికి నీరు సైతము దిగలేదు. ఎన్ని యౌషధములు దెచ్చిపోసినను లాభము లేక పోయెను. చాలబాధపడినాఁడు. ఇట్లే యతఁడు శారీరకమైన పెక్కురోగముల పాలయ్యెను. స్థలముమార్చినచో నారో గ్యము గల్గునను నాశతో 1885 సం॥ డిసెంబరు నెలలోఁ గలక త్తాకు సమీపముననున్న కాసిపూరులోనున్న యొకతోట లోనికిఁబోయి యచ్చటఁగాలక్షేపముఁజేయ మొదలుపెట్టెను.* అతనితోఁ బాటతని శిష్యవర్గముకూడ నచటికిబోయెను. అతఁ డచ్చటనే యెనిమిదిమాసములుండెను. 1886సం॥ ఆగష్టు 16వ

తేదిన సంధ్యాసమయమున నతఁడు శిష్యులనందఱను జేఱఁ బిలిచి చరమబోధగావించి సంతోషముగా భౌతిక దేహమును వదలెను. అతని తదనంతర మతనిశిష్యులతని మతమును విశ్వవ్యాప్తినిఁ గావించిరి. ఆశిష్యులలో వివేకానందుఁడొకఁడు రామకృష్ణుని పాంచభౌతిక దేహము బారానగరస్మశానమున దహింపఁబడినది. అతనియస్థికలు బేలూరునందు నేటికిని శిష్యవర్గముచేఁ బూజింపఁబడుచున్నవి.

---

# 3. వివేకానందుఁడు

కలకత్తాకు సమీపమున శిమూలియా యను నొక గ్రామము కలదు. ఆపల్లెలో కాయస్థజాతిలో దత్తవంశమను నది యొకటి కలదు. ఆవంశములో జన్మించిన వారందఱి నామములకుఁ జివర "దత్తు" అని వచ్చును. ఆదత్త వంశమునందు "విశ్వనాథదత్తు" అను పేరుగల యొక న్యాయవాది యుండెను. అతఁడు విశేషముగా ధన గౌరవము లార్జించెను. అతనిభార్యయు ననుకూలవతి, సాధుశీల, చాలఁ దెలివిగలది. సమస్త శాస్త్రములను నామెకుఁ గరతలామలకములు, ధీపటిమకుఁ దగిన జ్ఞాపకశక్తి కూడ నామెకుండెను. ఎన్ని యున్నను పాపమా దంపతులకు సంతానములేదు. ఆ కొఱఁతచే మిక్కిలి విచారించుచుండెడివారు. ఎన్నియో తీర్థముల నాడిరి. క్షేత్రముల దర్శించిరి. వ్రతముల నొనరించిరి. దేవ

బ్రాహ్మణ పూజలు, జంగమారాధనలు, సంతర్పణలు, నియతిమై నొనర్చిరి. లాభము లేకపోయెను. తుదకు దయామయుఁడగు నా కాశీపతియే తమకోర్కె నీడేర్పగలవాఁడను విశ్వాసముతో నచ్చటికేగి యయ్యాదిదేవుని పాదపద్మములకు భక్తితోఁ బ్రణామము లొనరించి యతనిపైననే సంపూర్ణ విశ్వాసముతో నుండిరి.

కాశినుండి స్వగ్రామమునకుఁ దిరిగివచ్చిన కొలది దినములకే 1862 జనవరి 9 వ తేదీన విశ్వనాథదత్తుని భార్య పరమేశ్వరానుగ్రహమున గర్భము ధరించి శుభలక్షణ లక్షితుఁడైన యొక మగపిల్లవానిని గనెను. పురుడు పది దినములును సలక్షణముగఁ గడచి నంతనే పదనొకండవదినమున వేడ్కతోఁ తలి దండ్రులబ్బాలునకు నామకరణ మహోత్సవ మొనరించి శివానుగ్రహమున జనించిన వాఁడగుటం జేసి 'నరేంద్రుఁ'డని పేరిడిరి. లేకలేక పుట్టినబిడ్డ, యందును మగబిడ్డయని యాచిఱుత వానిని గ్రిందదింపక యుల్లారు ముద్దుగా బెంచు కొనుచుండిరి. ఐదవయేట నక్షరాభ్యాస మొనర్చిరి. అతనికి గురువు లొక్కసారి చెప్పినఁ జాలును. చక్కగా గ్రహించెడివాఁడు. గ్రహణశక్తియేగాదు, జ్ఞాపకశక్తిగూడ మిక్కుటముగా నుండెను. చిన్ననాటఁ నుండియు నతనికి సంస్కృతమునందు మంచి యభిరుచి జనించెను. అనతికాలముననే విద్యలన్నియుఁ జాలవఱకు నేర్చెను. వివిధభాషలలో మంచి పాండిత్యము సంపాదించెను. విద్యప్రారంభించి నది మొదలొక్కవత్సరమైనను తప్పిపోక కృతార్థుఁడగుచుండెను. విద్యార్థిగానున్నప్పుడే యతఁడు క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధాదిమతములకుఁ జెందిన ప్రమాణ గ్రంథము లన్నిఁటిని

జదివి నిష్పాక్షిక బుద్ధితో వానిసారము నవగాహన మొన రించుకొనెను. ఈతడు గుణ్ణపుస్వారి, కు స్త్రీపట్టుట మున్నగు పనుల యందతని కింతింతయనరాని యిష్టము. సంగీతమునందతనికిఁ బ్రత్యేకాభిమానము. వట్టియభిమానమేగాదు. అద్భుతమైన పాండిత్యము, ననన్యసాధ్యమై యతిమధురమైన గాత్రమును గలఁవాడు. ప్రతివిషయముఁ దానుకన్నులతోఁజూచినఁగాని విశ్వసించువాఁడుకాడు. ఆవిద్యార్థిదశలో దేవుఁడున్నాఁడను నమ్మకము గూడ నతనికిలేదు. బి. యే. తరగతియందు 'వేదాంతము' (Philosophy) అతని కభిమాన విషయము. అందు వలనఁ బాశ్చాత్యతత్త్వశాస్త్రముఁ జదువ వలసి వచ్చెను. అదియతని కంతగా రుచించినదిగాదు. 'హెర్బర్టు స్పెన్సరు' అనునతఁడురచించినతత్త్వశాస్త్రము నందతనికనేక లోపములు గాన వచ్చెను. వానినన్నిఁటిని నరేంద్రుడు దీవ్రముగా ఖండించెను. స్పెన్సరున కేమియుఁ గోపము రాలేదు. నరేంద్రుఁడు చెప్పిన వన్నియు సంమజసముగనే యున్నవని సమ్మతించి యతనిని మెచ్చుకొని పాశ్చాత్యతత్త్వశాస్త్రగ్రంథములు కూడఁ జదువుమని ప్రోత్సహించెను.

నరేంద్రుఁడు కలకత్తాలో బి. ఏ. పరీక్ష యందు తీర్ణుఁడై న్యాయశాస్త్రముఁ జదువ మొదలు పెట్టెను. అతనికొక పిన తండ్రియుండెడివాఁడు, అతఁడు రామకృష్ణపరమహంస శిష్యకోటిలో నొకఁడు. కేవల నాస్తికుఁడుగానున్న నరేంద్రున కాస్తిక్యబుద్ధి గల్గింప నెంచి యాతని పినతండ్రి 1881 సం॥ నవంబరులో నొకదినమున తన గురువగు రామకృష్ణ పరమహంస కడకు దీసికొనిపోయెను. పరమహంస కరుణామృత వీక్షణములు నరేంద్రునిపైఁబ్రసరించెను. అతఁడునరేంద్రునిఁ

జూచి 'కుమారా! యొక్క పాట పాడు' మని యడిగెను నరేం
ద్రుఁడును విధేయతతో నొకటి రెండు పాటలు పాడి యతని
నెంతయు ముగ్ధునిగా నొనర్చెను. నరేంద్రుని దక్షిణేశ్వర
దేవాలయమునకు రమ్మని పరమహంస యాదేశించెను. అతని
యాజ్ఞననుసరించి నరేంద్రుఁడచ్చటికిఁబోయెను. తనగానమా
ధుర్యముచేఁ బరమహంస కెంతయు నానందము గల్గించి తన
కుఁగల యనుమానముల నెల్లఁ బరమహంసకు నివేదించెను.

అతఁడు సహేతుకముగను, శాస్త్రీయముగను వాని
నన్నిటినిఁ దొలగించెను. నరేంద్రుడు పరమహంసను జూచి
'దేవునిమీరుదర్శించితిరా' యనిప్రశ్నించెను. నిజముగాజూచి
తినని యతడు జవాబుచెప్పెను. నరేంద్రునకు మనఃపరివర్తన
ప్రారంభమయ్యెను. ఆలోచనానిమగ్నుఁడై 'స్వామీ! తిరిగి
తమదర్శనము చేసికొందు'నని వెడలిపోయెను.

కొన్ని దినములకుఁ జేసినవాగ్దానము ననుసరించి
కొంతమంది మిత్రులతో నరేంద్రుఁడు రామకృష్ణుని కడ
కరుదెంచెను. రామకృష్ణుఁడువిశ్రమించియుండెను. 'నరేంద్రా!
వచ్చి నాప్రక్కనే కూర్చుండు'మని పిలిచెను. అతడు వచ్చి
నంతనే రామకృష్ణుఁడు తనపాదమెత్తి నరేంద్రుని శిరము
మీఁదఁ బెట్టెను. తత్ఫలితముగా నరేంద్రునకుఁ బ్రపంచమం
తయు సూచముట్టుగా సంచలించుచున్నట్లు గన్పడెను. అతనికి
మిక్కిలి భయముగలిగెను. "గురూ! నేనుజనిపోవుచున్నాను:
మీరునన్నేమిచేయుచున్నారు?" అని బిగ్గఱగా నార్చెను.
రామకృష్ణుఁడు మాటాడలేదు. కాని కొంతసేపటికిఁ గాలు
మాత్రము తీసివైచినాడు. వెంటనే నరేంద్రునకు స్వస్థత కలి

గెను. నిజవిచిత్రానుభూతికి విస్మయమందుచు నరేంద్రుఁడు పరమహంస సెలవు గైకొని గృహంబునకేగెను.

మూఁడవసారి నరేంద్రుఁడొక్కఁడే రామకృష్ణుని సందర్శింప నేగెను. అప్పుడు రామకృష్ణుఁడు సమాధినిష్ఠుఁడై యుండెను. నరేంద్రుఁడు సూటిగా నతనిప్రక్కకుబోయి కూర్చుండెను. సమాధిస్థితిలోనుండియే రామకృష్ణుఁడు నరేంద్రునిదగ్గఱకు నెమ్మదిగాఁ గదలిరాఁ దొడంగెను. వచ్చి యతని శరీరమంతయు నొక్కమారు చేతితో నిమిరెను. తోడనే నరేంద్రునకుఁగూడ సమాధిస్థితికలిగెను. వారిరువురు కొంతసేపట్లే యుండిరి. తరువాత నిరువురకు స్మృతికలిగెను. రామకృష్ణుఁడు నరేంద్రునిఁ గొన్ని ప్రశ్నలు వైచెను. నరేంద్రుఁడు వాని యన్నిటికిని సరియగు సమాధానములు చెప్పెను. అతఁడు జీవిత రహస్యమంతయుఁ దనకుఁ బూర్తిగా విదితమైనదని కూడఁ దెలియఁజేసెను. నరేంద్రుడు చాల వివేకము గలవాఁడనియు నానాఁటికి క్షీణించుచున్న హిందూమతము నాతఁడే యుద్ధరింపఁగలవాడనియు, రామకృష్ణుఁడు దెలిసికొని యతనికి స్వయముగా 'వివేకానందుఁ'డని పేరిడెను. రామకృష్ణుఁడు నరేంద్రునకు యోగవిద్యనుకూడ బోధించెను.

1884 సం॥లో నాకస్మికముగా వివేకానందుని తండ్రి చనిపోయెను. సంసారము చాలఁబెద్దది యగుటచే నంతకంతకు ఋణభార మధిక మగుచుండెను. గృహనిర్వహణమెట్లో నరేంద్రునకుఁ దోచకుండెను. ధనికులగు కొందఱుస్నేహితుల నాశ్రయించెను. కాని యెంతకాలమట్లు గడపఁగలఁడు? అప్పటి కతని కిరువది రెండేండ్లు. ఉద్యోగము సంపాదించుకొనవలెననుకొనెను. అద్దానికై యథాశక్తిగాఁ జాల

ప్రయత్నించెను. కాని దురదృష్టవంతుఁ డగుటచేఁ దగిన యుద్యోగము లభించినదికాదు. ఉన్న కొంచెము ధనము వ్యయమయి పోయినది. ఎక్కడను నప్పుపుట్టుటలేదు. ఒక పూట తిని మఱియొకపూట పస్తుపరుండ వలసి వచ్చెను.

ఒకనాఁడు వివేకానందుఁడు కలకత్తానగర వీథులలో దిరిగి తిరిగి విసిగి వేసారి యొక్కచో నించుకసేపు కూర్చుండి 'ఇట్టి జీవితము గడుపుటకన్న సన్యసించుట మేలు. నిర్దయులైన స్త్రీ పురుషులతోఁగూడిన యీ తుచ్ఛ సంఘము నందొకఁడనై జీవించుటకన్న నే హిమాలయములకో పోయి తపం బొనర్చుచుఁ గాలము గడుపుట శ్రేయోదాయకము. అని తలపోయఁ దొడఁగెను. దైవవశమున రామకృష్ణుఁడా సమయమున నటనుండియే పోవుచుండెను. అతఁడు విరాగి యగు వివేకానందునిఁజూచి 'వత్సా'! నీతలంపుగ్రహించితిని. నీ వింకను గొంతకాలము సంఘమునందే యుండవలయును. అని యానతిచ్చెను. వివేకానందుఁడతనికి ప్రణామిల్లి 'వల్లె' యని యాతని యాజ్ఞ శిరసావహించెను.

ఎట్టులో సంసారభారమును నిర్వహించుచుండెనే కాని వివేకానందునకు దానిపై నెట్టి మమకారములేదు. అతని హృదయము పరిపక్వస్థితికివచ్చెను. తరచుగా నతఁడు రామ కృష్ణుని సన్నిధికేగుచుండెడివాఁడు. రామకృష్ణున కతఁడనిన నత్యంత వాత్సల్యము.

ఇట్లు రెండేండ్లుగడచెను. 1886 సం॥లో నొకనాఁడు రామకృష్ణుఁడు సిద్ధిపొందుటకు సిద్ధముగానుండెను. వివేకా నందు డప్పుడచ్చటనే యుండుట తటస్థించెను. దేవుఁడున్నా డనియు మానవసేవయే మాధవసేవయనియు సద్గానికై

యథాశక్తిగాఁ బాటుపడుమనియు రామకృష్ణుఁడు వివేకానందునకుఁ బరమ బోధయొనర్చి భౌతిక దేహమును జాలించెను. వివేకానందుడును గురువున కట్లొనర్తునని త్రికరణశుద్ధిగా వాగ్దానమొనర్చెను. అతనిబుద్ధి సంపూర్ణముగాఁ బరమునకు మలగెను.

వివేకానందుఁడు దల్లి యాజ్ఞగొని సన్యసించి హిమాలయములకు వెడలి యక్కడ నాలుగువత్సరములు ఘోరమైన తపం బొనర్చెను. తదనంతర మక్కడనుండి టిబెట్టునకేగి యప్పుడచ్చటఁ బ్రబలముగానున్న బౌద్ధమతమును గుఱించి బాగుగాఁ దెలిసికొని తిరిగి స్వస్థానమునకుఁ జేరుకొనెను. ఆసేతు శీతాచలము నా సింధు బ్రహ్మపుత్రము నతఁడు పర్యటనమొనర్చి రామకృష్ణుని బోధామృతమును వర్షించెను. అట్లు తిరుగునపుడతనికి ఖేత్రసంస్థానాధీశునితోఁ బరిచయము గలిగెను. అతని కతఁడు గురువై యతని మన్ననల నందఁజాలెను. వివేకానందు డంతియుగాక పశ్చిమ సముద్రతీరమంతయుఁదిరిగి తిరువాన్కూరు, చెన్నపట్టణము మున్నగుప్రసిద్ధ నగరముల దర్శించెను. అతఁడాయా ప్రదేశములలో నుపన్యాసములిచ్చి ప్రజల యాదరాభిమానములఁజూఱగొనెను.

ఇట్లుండ 1893 సం॥లో నమెరికాఖండమున సంయుక్తరాష్ట్రములలో చికాగో నగరమునందుఁ బ్రపంచ సర్వమత పరిషత్తొకటి జరిగెను. ఆ సభకు బ్రపంచమునందలి యన్ని మతముల ప్రతినిధులునువచ్చి తమతమ మతముల గొప్పదనమును వెల్లడిచేసిరి. హిందూమత ప్రతినిధిగావివేకానందునిఁ బంపఁదలఁచి చెన్నపురి పౌరులు, పెక్కుమంది భారత సంస్థా

నాధీశులు వలయు ధనమును బ్రోగుచేసి వివేకానందున
కొసంగి చికాగోనగరమున కంపిరి.

అమెరికాచేరు సరికి వివేకానందున కున్న డబ్బంతయు
ఖర్చయిపోయెను. అతఁడొకగ్రామముఁ జేరి యొకవీధి వెంటఁ
బోవుచుండఁగా నతని కాషాయాంబరములను, నాకర్షణీయ
మగు రూపమును జూచి యొక వృద్ధుఁడతనిని దనయింటికిఁ
బిలిచి యెంతయునాదరించెను. అతని పాండిత్యమున కచ్చెరు
వొందెను. ఒక విద్వాంసుని కడకాతనిని గొంపోయెను. ఆ
విద్వాంసుని సహాయముననే వివేకానందునకు సర్వమత పరి
షత్తులోఁ బాల్గొనుటకవకాశము లభించెను. ఆవిద్వాంసునకును
సర్వమతపరిషత్తునకధ్యక్షతవహింపనున్న డా॥ బ్రౌనుదొరకును
బరిచయముగలదు. పరిషదవసరమున బ్రపంచమునందలివివిధ
మతముల ప్రతినిధులందఱుఁ దమతమమతముల శాస్త్రమును
సహేతుకముగను సరసముగను నుపన్యసించిరి. వివేకానందు
నకు మొట్టమొదట నైదునిమిషములే యవకాశమొసంగఁ
బడెను. కాని యుత్తుంగగిరిశృంగ నిస్సరజ్ఝరీ వేగము
ననుకరించు నతని వాక్పూర ప్రసార మమెరికా దేశీయుల
నాశ్చర్య చకితులఁ జేసెను. అతని యిష్టము వచ్చినంతసేపు
మాటాడనీయవలసిన దేయని సభికులందఱు నధ్యక్షునిఁ బ్రార్థిం
చిరి. అధ్యక్షుఁడగు బ్రౌనుదొరకూడఁ జాలసంతోషించి వల్లె
యనెను. వివేకానందుఁడు విశృంఖలముగా రెండుగంటలకాల
మద్వైతమత శాస్త్రము నుగ్గడించెను. అతని యుపన్యాస
ప్రభావమెట్టిదో కాని యమెరికావాసులే కొంతమందియతనికి
శిష్యులైపోయి హిందూమతమును స్వీకరించిరి. మాడమ్
లూయీయను నామె యభయానందస్వామిని యను పేరనతనికి

శిష్యురాలయ్యెను. శాంక్సుబర్గు అనునతఁడు స్వామికృపా
నందుఁడయ్యెను. అల్లేమఱియొకదొర యోగానందస్వామి
యనుపేర వివేకానందునకు శిష్యుఁడయ్యెను. వేరొకదొరసాని
'నివేదిత' యనుపేరనొకశిష్యురాలయ్యెను.ఆమెవివేకానందు
నితో హిందూదేశమునకుఁగూడ వచ్చెను.

అమెరికాలో వివేకానందుఁ డొక వత్సరకాల
ముండెను. తరువాత నక్కడనుండి యింగ్లండునకు వెళ్ళి
యచటఁ గొంతకాల ముండెను. 1896 సం॥ డిసెంబరు 16 వ
తేదీన వివేకానందుఁడు కొంతమంది యాంగ్లేయ శిష్యులను
గూడ వెంటగొని హిందూదేశమునకుఁ బయనమయ్యెను.
కొలంబోలోదిగి యటనుండి చెన్నపట్టణమునకు వచ్చి కొన్ని
నాళ్లక్కడనేయుండి తరువాతఁ గలకత్తాకుఁ జేరెను.
కలకత్తాకు రెండుక్రోసుల దూరములో నాశ్రమమొకటి
స్థాపించి రామకృష్ణుని వలనఁ దానుగ్రహించిన బోధామృత
సారము చేఁబిపాసువుల పుడిసిళ్లు నింపుచుండెను. అట్టియాశ్రమ
మునే మఱియొకదానిని హిమాలయ ప్రాంతమునందుఁ గూడ
నెలకొల్పెను. 1897 సం॥లో వచ్చిన క్షామసందర్భమున
వివేకానందుఁడు నతని శిష్యబృందము చేసిన యపారసేవ
స్మరణీయము. ఆసమయముననే వివేకానందునియారోగ్యము
చెడిపోయెను. మరియొకసారి పాశ్చాత్య దేశముల కేగినచో
నతని యారోగ్యము బాగుపడునని కొందఱు వైద్యులతనికి
సలహాచెప్పిరి. అందుచే నతఁడు తిరిగి యూరపుఖండమునకుఁ
బోయెను. తత్ఫలితముగా నతనికిఁ గొంత తాత్కాలిక
స్వాస్థ్యము కలిగెను. ఆదినములలోనే యతని కింగ్లండులోఁ
బ్రఖ్యాత రచయితయగు మాక్సుముల్లరుతోఁ బరిచయము

గలిగెను. వివేకానందుఁడు సాన్‌ఫ్రాన్సిస్కో పట్టణము నందొక వేదాంత సంఘమును, నొక శాంతాశ్రమమును నెలకొల్పెను. అవి నేఁటికిని మంచిస్థితిలోనున్నవి. 1900సం॥లో పారిసు నగరములో ఫ్రెంచి భాషలో హైందవ వేదాంత రహస్యోపన్యాసముఁ గావించెను. ఇట్లే పలుతావులఁ బలు భాషలలో వేదాంత మహోపన్యాసముల జేసెను. వాని మూలమున శరీరమునకు శ్రమ యెక్కువయ్యెను. తిరిగి యతని యారోగ్యము చెడిపోయెను. అయినను నుపన్యసించుట మానలేదు. మతస్థాపనలమాట మరువలేదు.

ఆరోగ్యకారణముచేఁ బరదేశములో నిట్లెంత కాలముందునని వివేకానందుఁడు భారతదేశమునకుఁ దిరిగి వచ్చెను. వారణాసియందు నిజగురువగు శ్రీరామకృష్ణుని పేర నొక పాఠశాలను నొక యనాథాశ్రమమును స్థాపించెను. జపానీయులు కొందఱు వివేకానందునిఁ దమదేశమున కొకసారి రమ్మని యాహ్వానించిరి. అనారోగ్య కారణమున నతఁడా యాహ్వానమునందుకొని యచ్చటికిఁ బోఁజాలక పోయెను. 1902 సం॥ జులై 4 వ తేదీన ఉదయము వివేకానందుఁడు శిష్యవర్గమునకుఁ బాణినీయ సూత్రములను జెప్పి సాయంకాల ముపనిషద్భాష్యమును బోధించి నాఁటిరాత్రియే సమాధినిష్ఠుఁడై దానియందే సిద్ధిపొందెను. అప్పటి కాతనికి నలుబది వత్సరములు మాత్రమే యుండెను.

సద్వంశమున జనించి సర్వమత సారమును గూలంకషముగా గ్రహించి ప్రపంచమతములన్నిటిలో హిందూమతమే మిన్నయని లోకమున కెఱుకపఱచి యితర ఖండముల వారిని సైతము తన శిష్యులనుగాఁ జేసికొని రామకృష్ణుని దివ్య

బోధామృతము నఖండస్ఫూర్తిగా దేశము సందెల్లడల వర్షించి మానవసేవయే మాధవసేవయని విశ్వసించి యద్దానికై జీవితమును వ్యయించిన ధన్యజీవి వివేకానందుఁడు. ఆ మహనీయుని కీర్తి కలకాలము నిలుచుగాక !!

---

# 4. ఈశ్వరచంద్ర విద్యాసాగరుఁడు

వంగదేశమునందు మిడ్నపూరు మండలములో వీరసింఘు యను నొక గ్రామము గలదు. దానిలో నొక నిరుపేద కుటుంబమునందు 1820 సం॥ సెప్టెంబరు 20వ తేదీన ఠాకూరుదాసుబెనర్జీ, భగవతీదేవి యను దంపతులకు విద్యాసాగరుఁడు జన్మించెను. ఐదేండ్ల వయసువాఁడైనంతనే తలిదండ్రు లాతని కక్షరాభ్యాస మొనర్చిరి. ఆదినములలో మాతృభాషలకును సంస్కృతభాషకును బ్రాధాన్య మెక్కువ. విద్యాసాగరుఁడా యూరఁగల ప్రాథమిక పాఠశాలలో నున్నంతవఱకును వంగ సంస్కృత భాషలు రెండును జదివెను. తరువాఁతగూడ నాతని నెట్టులోఁ బెద్దచదువుఁ జదివింపఁ దలఁచి తండ్రితాను నిజముగాఁ బేదవాఁడయ్యు నచ్చటి కైదుమైళ్ళ దూరములో నున్న కలకత్తానగరమునకుఁ గుమారుని వెంటఁబెట్టుకొని పోయెను. ఆ కాలమున నింకను నయోమార్గము లంతగా లేవు. అందుచేఁ గాలినడకనే తండ్రి కొడుకు లిరువురును గలకత్తాకుఁ దరలిరి.

1829 సం॥ జూను 1 వ తేదీన ఠాకూరుదాసు బెనర్జీ విద్యాసాగరునిఁ గలకత్తాలో నొక సంస్కృత కళాశాలలో బ్రవేశపెట్టెను. కుమారుఁడు చిన్నవాఁడగుటచే నొంటరిగా విడిచిపెట్టి వెళ్లుటకు బుద్ధిపుట్టక ఠాకూరుదాసు నెలకు 10 రూ జీతముపై నచ్చటనే యొకవర్తకునికడ గుమాస్తాగాఁ బని చేయుటకుఁ గుదిరెను. తండ్రికొడుకు లిరువురును నొక స్నేహితుని యింట నొకగదిలోఁ గాలక్షేపముఁ జేయుచుండిరి.

విద్యాసాగరుని తల చాలపెద్దది. శరీరము సన్నగా దుర్బలముగా నుండెడిది. చూచుటకంత యందముగా నుండెడివాఁడు కాఁడు. అందుచే సంస్కృత కళాశాలలో నతఁడు బ్రవేశించిన దినమునఁ దోడివిద్యార్థు లతఁనిఁజూచి విరుగఁబడి నవ్విరి. విద్యాసాగరుని హృదయ మావంతయుఁ జలింపలేదు. వారిపై నెట్టి ద్వేషభావము వహింపలేదు. క్రమ క్రమముగా నతనిబుద్ధి సూక్ష్మతను వారు మెచ్చుకొని యతనివెంటఁ దిరుగుచు ననేక విషయముల నతనివలనఁ దెలిసికొను చుండెడివారు అతఁడా సంస్కృత కళాశాలలోఁ దర్క—వేదాంత శాస్త్రములు, కావ్యాలంకారములు, జ్యోతిశ్శాస్త్రము సంపూర్ణముగాఁ జదివెను. తరువాత న్యాయశాస్త్రముఁ జదివి యాపరీక్షలో నుత్తీర్ణుఁడయ్యెను. వెంటనే ప్రభుత్వోద్యోగ మొకఁటి లభించెను. కాని తండ్రి కాయుద్యోగ మిష్టములేక మాన్పించెను. విద్య పూర్తియగుటచే నింటికిఁ దీసికొనిపోయి 8 సం॥లు వయస్సుగల యొక బాలికఁ దెచ్చి పెండ్లిచేసెను. ఆమె పేరు దీనమాయి. విద్యాసాగరుఁడు దానింకను జదువుకొన వలసిన దెన్నియో కలవని తిరిగి మరియొకసారికలకత్తానగరమున కొంటరిగావచ్చి

రెండు సంవత్సరముల పాటక్కడేయుండి సాంఖ్యము, వైశేషికము మున్నగు శాస్త్రములనుగూడ నోపికతోఁ బఠించెను. ఇంతచదివిన మీఁదట స్వయముగా గద్య పద్య రచనలు చేయమొదలుపెట్టెను. ఎట్టిగహన విషయములైనను జక్కఁగా వ్యాసరూపమున వ్రాసెడివాఁడు. అతఁడొకమారు తనరచనలకు రు 100, రు 50,లు బహుమానముల నందెను. హిందూ ధర్మశాస్త్రపరీక్షలోఁ గృతార్థుఁడయ్యెను. సంస్కృతభాషతో బాటుగా నాంగ్లభాషనుగూడ నభ్యసించుటచే దానిలోఁ గూడఁ జక్కని పాండిత్యమును సంపాదించి విద్యాసాగరుఁడను బిరుదము నొందెను.

1840సం॥లో విద్యాసాగరుఁడు దానుజదివిన సంస్కృత కళాశాలలోనే వ్యాకరణాచార్యుఁడుగాఁ బ్రవేశించి గొద్ది కాలము పనిచేసెను. ఇంతలో ఫోర్టువిలియం కళాశాలలో నెలకు 50 రూప్యముల వేతనముపైఁ బ్రధాన పండితపదవి ఖాళీకాఁగా నీతఁడు దాని నలంకరించెను. అతఁడు తలిదండ్రులకు నెల కిరువదిరూప్యములంపుచుండెడివాఁడు. ఆకాలముననందే విఖ్యాతపురుషుఁడగు సురేంద్రనాధబెనర్జి తండ్రియగు దుర్గచరణబెనర్జితో విద్యాసాగరునకు స్నేహముకుదిరెను. వారి సాహచర్యమువలన నతని కాంగ్లభాషలోఁ జక్కని ప్రావీణ్యముఁ గలిగెను.

ఆకాలమున హిందూదేశమునకు గవర్నరు జనరలుగా నున్న హార్డింజిప్రభువు 1844 సం॥లో విద్యాసాగరుఁడు పని చేయుచున్న ఫోర్టువిలియంకళాశాలను జూడవచ్చెను. వారిరువురు భారతీయ విద్యావిషయములు బాగుగాఁజర్చించిరి. విద్యాసాగరుని సలహాపై హార్డింజి 101 మాతృభాషా పాఠశాలలు

దేశమునందచ్చటచ్చట నెలకొల్పెను. ఆకళాశాలలో నతఁడు పనిచేయుచున్నప్పుడతనికి మఱియొక పెద్దఉద్యోగమువచ్చెను. అతఁడు నిజమైన స్వార్థత్యాగియగుటచేఁ దానాయుద్యోగమును వదలుకొని యద్దానిని దనకు మిత్రుఁడగు తారానాథుఁడను వాని కిప్పించెను. 1846లో ఫోర్టువిలియం కళాశాలలో నుద్యోగముఁ జాలించుకొని వెనుకచేసిన సంస్కృతకళాశాలకు సహాయకార్యదర్శిగా నయ్యెను. ఆయుద్యోగము నందున్నప్పుడే యతఁడు వంగభాషలో 'వితలపంచవింశతి' అనునొక వచనకావ్యమును రచించెను. అతఁడు తత్కళాశాలాభివృద్ధికెంతయో పాటుపడెను. కాని తన పై యధికారులకుఁ దనకు బడకపోవుటచే నాయుద్యోగమునకు రాజీనామా యిచ్చెను. రెండుమూఁడు సంవత్సరముల కాలము యథేచ్ఛగా గ్రంథరచన చేసెను. కొంతధనము సంపాదించెను. సొంతముగా నొక ముద్రాయంత్రమును నెలకొల్పెను. పత్రిక నొకదానిని నడిపెను. స్త్రీవిద్యావిషయమై యెంతయోపాటుపడెను. కాని యవియన్నియు నెక్కువకాలము కొనసాగినవికావు.

1849సం॥లో మరల ఫోర్టువిలియం కళాశాలలో నెలకు 80 రూ వేతనముపై నొక యుద్యోగము లభించెను. అతఁడక్కడఁ బని చేయుకాలముననే స్త్రీవిద్యావ్యాప్తికెక్కువకృషి సల్పెను. అప్పుడే యా విషయమునఁ బ్రత్యేక పరిశ్రమ చేసిన విద్యాసంఘాధ్యక్షుడగు బెతూన్ దొరవారి స్నేహము గలిగెను. మఱుసటి సంవత్సరమే (1850) బెతూన్ దొరగారు విద్యాసాగరుని దాను స్థాపించిన బాలికా పాఠశాలకు నెలకు 90 రూ॥ పై రమ్మని యాహ్వానించెను. కొంతకాలమతఁడచ్చటఁ బండితుఁడుగాఁ బనిచేసెను. అనతికాలముననే

యతఁడా కళాశాల ప్రధానోపాధ్యాయుఁడయ్యెను. శాలిక లకు సంస్కృతభాష బోధించుటకు సులభమార్గముల నెన్నిటినో కనిపెట్టెను. 1851 సం॥లో బెతూన్ మహాశయుఁడు చనిపోగా నప్పుడు వంగదేశపు గవర్నరగు హాలిడే యను నాతఁడు విద్యాసాగరునే బెతూన్‌పాఠశాల కధికారిగా నియమించెను. 1854 లో వంగదేశ ప్రభుత్వమువారు విద్యాసాగరు నొక నూతన విద్యాప్రణాళికను దయారు చేయుమనికోరిరి. అతఁడట్లే యొనర్చెను. 1855 లో నీతఁడు హుగ్లీ, నాడియా మొదలగు నాల్గు మండలములకుఁ బాఠశాలా పరీక్షాధికారిగా నియమింపఁబడి నెలకు రు 500 ల వేతనము సంపాదించెను. అతఁడా యుద్యోగములోనున్న కాలముననే హుగ్లీ, బర్ద్వాన్, నాడియా మున్నగుమండలములలో సుమారు 40 పాఠశాలలనుస్థాపించెను. అట్లు విద్యాధికారిగాఁ బని చేయుచుండ పై యధికారి(డైరెక్టరు)యగు 'యంగ్' యను నతనికిని విద్యాసాగరునకును నభిప్రాయ భేదముగల్గి విద్యాసాగరుఁడు దనయుద్యోగమునకు రాజీనామాయిచ్చెను. ఆసందర్భమున వంగదేశపు గవర్నరగు హాలిడే ప్రభువు జోక్యముఁ గల్గించుకొని రాజీనామా నుపసంహరించికొని పనిచేయుమని యెంత బ్రతిమాలినను విద్యాసాగరుఁడు వినలేదు.

ఉద్యోగములోనున్నంత వఱకు దేశసేవ చేయుటకు వీలులేదని యతఁడు గ్రహించి బుద్ధిపూర్వకముగా నద్దానికిని బరిత్యజించి యథాశక్తిగా దేశసేవచేయ నడుముఁగట్టెను అతఁడప్పటికే యనేక గ్రంథములను రచించి స్త్రీ విద్యావ్యాప్తియున్నగు మహత్తర విషయములలో గొంత కృషి సల్పెను. అతఁడు వంగ, సంస్కృతభాషలలోఁ బెక్కు గ్రంథము

లను వ్రాసెను. వంగదేశచరిత్రము,సత్పురుషులజీవితచరిత్రలు, చరితావళి,బోధోదయము,బూదిజూపథము, సీతావనవాసము, శకుంతల వ్యాకరణకౌముది, భ్రాంతివిలాసము మున్నగునవి యాతఁడు వ్రాసినగ్రంథములలోఁ జేర్పఁదగినవి. అతనిగ్రంథము లిప్పటికిని వంగదేశమునఁబఠనీయగ్రంథములుగానున్నవి.

స్త్రీ పునర్వివాహ విషయమై విద్యాసాగరుఁడుచేసిన కృషి యసదృశ్యము. అతఁడు పేరునకు మాత్రమేకాక నిజ ముగాఁగూడ విద్యాసాగరుఁడగుటచే వితంతూద్వాహము శాస్త్రసమ్మతమగునా కాదాయని శాస్త్రముల నన్నిటిని దరిచిచూచెను. పునర్వివాహము శాస్త్రసమ్మతమే యని యాతఁడు 1854 సం॥లో గ్రహించెను. దానిపై 'విధవా వివాహము' అను నొక గ్రంథమును వ్రాసెను. 1855 సం॥ అక్టోబరు నెలలో వితంతువివాహ శాసనమును ప్రభుత్వ ముచేఁ జేయించుటకు వెయ్యిమంది చేత నొక మహాజరుపై సంతకములు చేయించి ప్రభుత్వమున కందఁజేసెను. ఆసంతక ములు చేసినవారిలో నాడియా, బర్ద్వాన్ ప్రభువులు గూడఁ గలరు. ఆ యాందోళన ఫలితముగా 1856సం॥లో వంగరాష్ట్ర ప్రభుత్వము వితంతు వివాహ శాసనమును జేసెను. 1856 సం॥ డిసెంబరు నెలలో విద్యాసాగరుఁడే కలకత్తాలో దన యింట మొట్టమొదట వితంతువివాహ మొనర్చెను. ఆ వివా హమునకు సుప్రసిద్ధ సంఘ సంస్కర్తయగు రామమోహన రాయల కడసారి కుమారుఁడగు రాంప్రసాదరాయికూడ వచ్చెదనని విద్యాసాగరునకు వాగ్దానముజేసెను. కానియంతటి వాఁడుకూడ నాఁటి సంఘదూషణకు వెరచి యచ్చటకుఁబో లేదు. వలసినచో ధన సాహాయ మొనర్తునని విద్యాసాగరు

నకుఁ గబురంపెను. అతని భీరుత్వమునకు విద్యాసాగరుఁడు మిక్కిలి వగచెను. రామమోహనుని కడుపున నెట్టి దుర్భాగ్యుఁడవు జన్మించితివిరా! అని యతనిని బలువిధముల నిందించెను. అతడప్పుడొనర్చిన ప్రథమ వితంతువివాహఫలముగా నతనిని సంఘమునుండి బహిష్కరించిరి. వంగదేశమునందలి సనాతనాచారపరులు పెక్కుమంది యతనిపై దిరుగబడిరి. ఉపన్యాసముల ద్వారమున వారతని వర్తనమును ఖండింపసాగిరి. కొందఱు దుర్మార్గులతని నింకను ననేకవిధముల బాధించిరి. ఎన్నికష్టములువచ్చినను విద్యాసాగరుఁడు ధైర్యోత్సాహములు మాత్రము వీడలేదు. పట్టుదలతో నాసంఘ దురాచారమున కెదురీదెను. తానంత ధనికుఁడు కాకున్నను, నున్నదానిలోనే కొంతఖర్చుచేసి యతడనేక వితంతువులకు వివాహములొనర్చెను. నిజతనూజులకు యుక్తవయస్సు వచ్చిన తరువాతనే పెండ్లిజేసెను.

విద్యాసాగరుఁడు విద్యాసాగరుఁడేగాదు. దయాసాగరుఁడుగూడ. ఆపత్కాలములయందు స్నేహితుల కొఱకై యతఁడడ్డుపడి వారికి ధనసాహాయ్యము చేసిన సందర్భములెన్నియోకలవు. వంగభాషలో సుప్రసిద్ధ కవియని పేరొందిన మధుసూధన దత్తు అనునతఁడు ఫ్రాన్సుదేశమునందున్నప్పుడును నప్పులపాలై చెఱకుఁ బోవుటకు సిద్ధముగా నున్నప్పుడును నింకను ననేకసందర్భములయందును నాతనికై సుమారు పదివేల రూప్యములు ఖర్చుపెట్టెనట. వివాహమూలమున నొకబ్రాహ్మణు డప్పులపాలై న్యాయస్థానమునకుఁ దీసికొనిపోఁబడినప్పుడు విద్యాసాగరుఁ డతని నిమిత్తమై రు 2400 లు అప్పులవారి కొసంగి యతనిని కాపాడెను. ప్రతివత్సరము

స్వగ్రామ వాసులకు రు 500 విలువగల వస్త్రములను బంచి పెట్టెడివాడు. అతఁడనేక ధర్మ వైద్యశాలల నెలకొల్పెను. వానిని స్వయముగాఁ బోషించెను. 'ఇండియన్ ఎసోసియేషన్' అను సభవారు కట్టించిన భవనమునకు రు 1,000 లు దానమిచ్చెను. హిందూ కుటుంబ (Hindu Family Annuity fund) అను పేరఁ దక్కువ జీతము గల వారి లాభము నిమిత్తమొక సంఘమును నెలకొల్పెను. 1868 లో వచ్చిన మహాక్షామములో నతఁడు ప్రజల కెంతయో తోడ్పడెను. 1869సం॥లో బర్ద్వాన్ పట్టణమునందు మన్యజ్వరము తీవ్రముగా వ్యాపించెను. అక్కడ సివిల్ సర్జన్‌గాఁ బనిచేయుచున్నవాఁడు సరిగా దనధర్మమును నిర్వర్తింపకుండెను. ప్రజలెందరో చనిపోవుచుండిరి. విద్యాసాగరున కావిషయము దెలిసెను. వెంటనే యతఁడు వంగరాష్ట్రప్రభుత్వ గవర్నరుతో నావిషయమైముచ్చటించి యాసివిల్ సర్జనుని దొలఁగించి వేసెను. సరిగాఁ బనిచేయు మఱియొక వైద్యుని అచ్చట నియమింపఁజేసెను. అతనికి బర ధనాపేక్ష ఇసుమంతయైన లేదు. రామకృష్ణపరమహంస యొక మారు స్వయముగా విద్యాసాగరుని దర్శించి మాట్లాడెను.

బహుముఖమైన దేశసేవవలన విద్యాసాగరుని యారోగ్యము చెడిపోయెను. చివరదినములలో నతఁడు వైద్యులసలహాపై సొంతాలు పరగణాలోనున్న కార్మతారు గ్రామమునఁ గొంతకాలముండెను. 1890 సం॥ డిసెంబరు నెలలో నతఁడు చంద్రనగరమునకుఁ బోయెను. ఆ సంవత్సరమే జనవరిలో జరిగిన దర్బారులో దొరతనమువారు సి. ఐ. ఇ. బిరుదమునిచ్చి గౌరవించిరి. తరువాత కలకత్తాకుఁ జేరెను. అప్పటి కతని కుటుంబము నందున్న వారిలోఁ జాల

మంది చనిపోయిరి. 1888 సం॥రంలో నతనిభార్య దీనమాయీా దేవికూడ మృతినొందెను. నానాటికి విద్యాసాగరుఁడు క్షీణించెను. 40 దినములతనికి స్మృతియేలేదు. ఉన్నవాడున్నట్లే పడియుండెను. తుదకు 1891 సం॥ జులై 9 వ తేదీన ఆ మహానీయుఁడు కాలగతి నొందెను. అతని కప్పటికి డెబ్బది యొకటవ సంవత్సరము.

నిరాడంబరత, దేశాభిమానము, సంఘసంస్కరణాభిలాష, పరోపకారపరాయణత్వము, ధర్మకార్యాసక్తి, ఆత్మగౌరవము, విద్యాసాగరునియందు మనకు లభించు నమూల్య రత్నములు. ఆమహానీయునిపై ననేక గేయములు, పద్యములు నల్లుకొని వంగేయులిప్పటికిని వానిని స్మరింపని దినముండదు.

---

# 5. స్వామిదయానంద సరస్వతి

నేఁడు గుజరాత్ అని పిలువబడు ఘూర్జర దేశములో మోర్వీయను పట్టణముండెను. 19వ శతాబ్ద్యారంభమున నంబాశంకర్ అనునొక బ్రాహ్మణుఁ డచ్చట వాసము చేయుచుండెను. అతఁడు ప్రభుత్వోద్యోగముచేసి బాగుగ ధనము సంపాదించెను. అతనికి బిత్రార్జితమగు భూవసతియు గొంతయుండెను. అతఁడు గొప్ప శివభక్తుడు. శిష్టశైవాచార పరాయణుఁడు. అతని భార్యయు ననుకూలవతి. ఆ దంపతు లిరువురును నిరంతరము పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా

మహోత్సవము లొనరించుచు వ్రతోప వాసాదులతోఁగాల క్షేపము జేయు చుండెడివారు.

ఆ దంపతులకు 1823 సం॥లో శివుని యనుగ్రహ విశేషముచే నొక కుమారుఁడు పుట్టెను. అబ్బాలునకు జననీ జనకులు మూల శంకరుఁడని నామకరణముచేసిరి. తమవలెఁ దమ పుత్రుడును బరమ శైవుడు కావలెనని వారికోరిక.

మూలశంకరుఁ డింటియొద్దనే సంస్కృతము నభ్య సింప మొదలుపెట్టెను. మహామేధావి యగుటచే నచిర కాలములోనే దానియందుఁ జక్కని ప్రావీణ్యము సంపా దించెను. అతనికిఁ బదునాలుగేండ్లు నిండెను.

ఆ దినము మహాశివరాత్రి. రాత్రివరకు మూలశంకరుని తల్లి దండ్రులుపవాస ముండిరి. ఇంకను జెక్కండ్రు వీర మహేశ్వరులు శైవాగమములను బఠించుచు శివపూజలు చేయుచుండిరి. శివాలయములలో మిక్కిలి కోలాహలముగా నుండెను. పగలంతయు నుపవసించి రాత్రి యభిషేకము తదితర పూజాదికము లొనరించుటకై కుమారుఁడగు మూలశంక రుని వెంటఁగొని యంబాశంకరుడును, భార్యయు నొక శివా లయమున కేగిరి. అచ్చట భక్తుల పూజా పురస్కారము లన్నియుఁ బూర్తియగు నప్పటికిఁ జాల ప్రొద్దుబోయెను, అందఱును నాయాలయమునందే యచ్చటి వారచ్చటనించుక విశ్రమించిరి. మూల శంకరుడును పండుకొనెను. కాని యత నికి నిద్ర పట్టినదికాదు. అతనిదృష్టి శివలింగముపై బడెను. ఇంతలో నొకమూలనుండి యొక యెలుక లింగముముందు పెట్టఁబడిన తినుబండముల కొఱకచ్చటికివచ్చి వానినిఁ దిను చుండెను. అది కనిపెట్టి మఱియొండు రెండెలుకలు వచ్చెను.

అవియన్నియు నచ్చటి పదార్థములెల్లఁ దిని స్వాభావికచపల
భావమున లింగముపైఁ నెక్కి స్వేచ్ఛగాఁ దిరుగనారంభిం
చెను. ఆదృశ్యము మూలశంకరుఁడు చూచి "ఇదియేమిరా!
ఈలింగము దేవుఁడుగదా! అతఁడు సర్వశక్తియుతుఁడని వీరం
దఱును బూజించిరి. ఈక్షుద్రమూషికములిట్లుఁ విచ్చలవిడిగా
నెత్తిపై కెక్కి తిరుగుచున్నను నతఁడుమాటాడఁడేమి? అతఁడు
దేవుఁడుకాఁడా? లేక పూజించిన యీ భక్తులందఱును
మూఢులా?" అని తర్కించుకొన మొదలుపెట్టెను. ఎట్లును
శాలుపోయినదికాదు. అందుచే వెంటనే ప్రక్కనే నిద్రించు
చున్న తండ్రిని లేపి తన హృదయగతమైన ప్రశ్న పరంపర
యాతనికిని వేదించెను. ఆప్రశ్నలు తండ్రివిని "ఛీ,మూఢాత్మా!
ఇట్టి పిచ్చిప్రశ్న లెప్పుడును వేయకుము. అని మందలించి
పండుకొనుమని చెప్పి హెచ్చరించెను. తండ్రి కేదురాడక
వెఱచి పండుకొనెనే కాని యతనికి నిద్ర యెట్లుపట్టును? వారు
పూజించుచున్న విగ్రహము భగవంతుఁడు కాడఁని యతని
విశ్వాసము. విగ్రహారాధన హిందూమతవిరుద్ధమని యతని
మతము. విగ్రహపూజకూడదని యతనిసిద్ధాంతము. అయినను
కొంతకాలమువరకుఁ దండ్రికావిషయము తెలియనీయలేదు.

గుడిలో నాఁటిరాత్రి తండ్రి ఛీవాట్లు పెట్టినదిమొదలు
మూలశంకరుని బుద్ధి పూర్తిగమారిపోయెను. తన ప్రశ్నలకు
దండ్రి జవాబు చెప్పలేక యాగ్రహించెనని గ్రహించి యా
విషయమై యాతనితో నెప్పుడును బ్రస్తావించెడివాడు కాఁడు.
తనలోఁదానే యేదియో యెల్లప్పుడును నాలోచించుచుండెడి
వాఁడు. తత్త్వజిజ్ఞాస యతని హృదయమున బాగుగఁ బాదు
కొనెను. ఆసమయముననే యతని ప్రియసోదరి విశూచి

వ్యాధిచే నాకస్మికమరణము నొందెను. కొద్ది దినములకే నతని పినతండ్రియు పరమపదించెను. అప్పటినుండియు మూలశంకర్ని తత్త్వవిచారణ మినుమడించెను. జననమరణరహస్యముల నెఱుంగవలయునను తహతహ యత్ని కెక్కువయ్యెను. మృత్యువును జయింపవలెనని యతఁ డుద్యుక్తుఁడయ్యెను.

సదామనన శీలుఁడై యైహికమును రోసినవానివలెఁ గన్పట్టు కుమారునిఁజూచి తలిదండ్రులు మిక్కిలి విచారపడి వివాహమొనరించినచో నతఁడు చక్కఁబడుఁనని యూహించి యద్దానికై ప్రియత్నించిరి. మూలశంకరుఁ డీవిషయము నెఱిగి తనకు పెండ్లి వలదని వారిని వారించెను. పెండ్లిమాట దలపెట్టినచోఁ బాఱిపోవునని భయపడి వానిని సమీపగ్రామమున నొకపురోహితునికడఁ జదువఁబెట్టిరి. మూలశంకరుఁ డచ్చట నున్నట్లే యుండి తిరిగి తన తల్లిదండ్రులు తనవివాహప్రియత్నము చేయుచున్నారని విని యటనుండి యొకయర్థరాత్రముసఁబట్టుకొనుటకువీలులేనంతదూరము పాఱిపోయెను.

అతఁడొక యరణ్యమార్గముపట్టెను. పలుకష్టములకు లోనయ్యెను. కాని ధైర్యము మాత్రము వీడలేదు. ఒకచో నతఁడొక సన్న్యాసిని గలసికొనెను. తానుగూడ నతనివలెఁ గావలెనని యతఁడనుకొనెను కాని గుడ్డలుగట్టి బ్రహ్మచర్యముఁ బాటించుచు 'శుద్ధచైతన్య బ్రహ్మచారి' అని తన నామమును మార్చుకొనెను. అతఁడా సన్న్యాసి వెంటనంటి కొంతకాలము తిరిగెను. తరువాత నొంటరిగా బయలుదేరిపోయి సిద్ధపురమను పట్టణముఁజేరెను. అక్కడఁ బ్రతివత్సర మొకసభ జరుగును. దానికి సిద్ధసాధు సత్పురుషు లెందరో వచ్చునాచారముగలదు. ఆ సమావేశమునకు వచ్చెడి సిద్ధపురుషులలో

నెవ్వఁడైన దనకు జ్ఞానోపదేశముఁ జేయువాఁడుండక పోవునా
యనునాశతో నతఁడచ్చటనాగెను.

అతఁడు సిద్ధపురము వచ్చెనను వార్తఁ దెలిసి కొంత
మంది యనుచరులతో నంబాశంకరుఁడచ్చటికేగెను. కుమా
రుని కాషాయాంబరములు భిక్షాపాత్రముఁ జూడగనే తండ్రి
కడుపు బ్రద్దలయ్యెను. కుమారుఁడు దనయాశయములన్నియు
భగ్నముఁజేసెనని కోపించి యంబాశంకరుఁడాతని చేతిలోని
పాత్రనులాగుకొని నేలపైఁబగులనేసెను. అతఁడుకుమారునిఁ
బలువిధముల నిందించెను. శాంతమూర్తియగు మూలశంక
రుఁడు మారుమాటాడలేదు. తండ్రి యతనినిజూచి తనతో
రమ్మని యాజ్ఞాపించెను. కుమారుఁడాతని వెంటనంటెను.
వారిరువురును బయలుదేరి స్వగ్రామమునకుఁ బోవుచుఁ
జీకటి పడుటచేఁ ద్రోవలో నొకసత్రములో బసచేసిరి. నాఁటి
రాత్రి యంబాశంకరుఁడు గుఱువెట్టి నిద్రించుచుండగా మూల
శంకరుఁడు మరలఁబారిపోయెను. తండ్రి లేచి చూచుసరికిఁ
గుమారుఁడగుపడలేదు. ఇఁక వానిని మార్చుట దుస్సాధ్యమని
యంబాశంకరుఁడు నిరాశచేసికొని నిజగృహోన్ముఖుడయ్యెను.

మూలశంకరుఁడు తిరిగి యనేక సాధుపురుషులను
దర్శించెను. చివరకతనికి స్వామి పూర్ణానంద పరమహంస
యను నొక మహనీయుని దర్శనభాగ్యము లభించెను. అతనినిఁ
జూచి నప్పటినుండియు మూలశంకరునకు గురుభారము కుది
రెను. అతఁడే మూలశంకరునకు 'దయానంద సరస్వతి' యను
నామమొసఁగి తత్త్వోపదేశ మొసఁగి యనుగ్రహించెను.
అతఁడాపరమహంస కడనే కొంతకాలముండి యనేక వేదాంత
రహస్యముల నెఱింగెను.

అనంతరము దయానందుఁడు తీర్థయాత్రలను సేవింప వలెనను సంకల్పముతో బయలుదేరి హరిద్వారము, హృషీకేశము, బదరీనాథము, కాన్పూరు, అలహాబాదు మున్నగు మహాక్షేత్రములదర్శించెను. అన్నియుఁగాలినడక నేపోయెను. అతఁడు హిమాలయములను గూడ దర్శించెను. వానిలోనొక యాశ్రమము నిర్మించుకొని యచ్చటఁగొని దినములు గడిపెను. అక్కడనతని కొకమతాధికారితో బరిచయము కలిగెను. ఆమఠమునకుఁ గొన్నిలక్షల యాస్తియుండెను. అతఁడు దయానందు నచటనుండుమనికోరెను. ద్రవ్యాపేక్ష తనకు లేదనియు, నట్టికోర్కెయే యుండినఁ దన యొద్దనే కావలసిన ధనముగలదనియుఁ జెప్పి నిరాకరించెను. అతఁడు హిమాలయ ప్రాంతమునఁ జాలదూరము పోయెను. ఎన్నియో హిమనదముల దాటెను. అట్లుకొంతదూరము పోగానే యతని కక్కడ నొక సిద్ధుఁడు కన్పడెను. దయానందుఁడు నిజసంశయములను గొన్నిఁటినాతనికి నివేదించి విచ్ఛేదము చేయుమని ప్రార్థించెను. కాని యాసిద్ధుఁడట్లు నరింపఁజాలకపోయెను.

దయానందుఁడావిధముగాఁ బదునారేండ్లు తిరుగాడెను. సంపూర్ణ తత్త్వజ్ఞాన మతని లక్ష్యము. మథురఅను నొక పట్టణమున నెనుబదియేండ్ల వాఁడొకఁడున్నాఁడనియు, నతఁడు దవసంశయ నివృత్తి చేయగలఁడనియు విని యతఁడచ్చటికిఁ బోయెను. ఆవృద్ధుని పేరు విరజానందుఁడు. అతఁడు నిజముగా జ్ఞాన వయోవృద్ధుఁడు. అతని యాశ్రమమునకు వెళ్లి దయానందుఁడు మెల్లగాఁ దలుపుఁ దట్టెను. విరజానందుఁడు తలుపు తెఱచి దయానందునిఁజూచి యవ్యాజప్రేమంబున గౌగిలించు

కొని తనకడ నుండుటకుఁ దావొసంగెను. అప్పటికి దయా నందునకు ముప్పదియారేండ్లు.

విరజానందుని యాశ్రమములో జీవితము కఠినియమ బద్ధము. దయానందుఁడు ప్రతిదినము తెల్లవారు జామున 3 గంటలకు మేల్కాంచి యాశ్రమ సమ్మార్జన జలాహరణాది కృత్యము లెన్నియో నిర్వర్తింపవలెను. ఎట్లో యోపికపట్టి దయానందుఁడు కొంతకాల మక్కడఁ గడపెను. నాల్గు వేద ములు పూర్తిగాఁ జదివెను. సకలశాస్త్రముల సారము కరత లామలక మొనరించుకొనెను. విద్యపూర్తియైనంతనే విరజా నందునకుఁ నతఁడేవియో గురుదక్షిణ సమర్పింపబోగా నతఁడు 'దయానందా! వేరువిధమగుగురుదక్షిణ నాకువలదు. వేదసారమును లోకమున కందజేయుము. అదియే నాకు మిక్కిలి యిష్టమగుగురుదక్షిణ' అనిపలికియాతని నాశీర్వదించి పంపివైచెను.

దయానందుఁడు 40వ యేట గురూపదేశాను సార ముగా హిందూదేశ పర్యటనము ప్రారంభించెను. అతఁడనేక రాష్ట్రములు, స్వదేశ సంస్థానములు చూచెను. ఎక్కడఁ జూచినను నతనికిఁ బ్రజలలో విగ్రహారాధన మెక్కువగా గనఁబడు చుండెను. వారిలో నంధ విశ్వాసములును బెక్కు పాతుకొని యుండెను. వారి ప్రాచీన నాగరికతను, ఉపని షన్మాతమును, ఏకేశ్వరోపాసనమును వారు విస్మరించిరి. అనేక దేవతారాధనలు, విగ్రహపూజ, బాల్యవివాహములు స్త్రీల యెడ నిరాదరణ, వర్ణవ్యవస్థ, అస్పృశ్యత, యివి

యన్నియు హిందూమతి కల్పమునకుఁ జీడపురుగులవలె నుండెను. వానిని మొదలంట రూపుమాపినఁగాని సనాతన హిందూమతము నిలువఁ జాలదని యతఁడను కొనెను.

హరి ద్వారములోఁ బ్రతివత్సరము 'కుంభమేళా' యను నొక యుత్సవము జరిగెడిది. దానికి భక్తు లెందఱో దూరప్రాంతముల నుండి సైతము వచ్చెడివారు. అక్కడికిఁ బోయిన బహుజనులకు దనయభిప్రాయములను, వైదిక మతస్వరూపమును బోధించుట కవకాశముండునని యను కొని యచటకు బోయెను. ఉత్సవ దినమున నచ్చటికి వచ్చిన వారందఱకును నిజమత సందేశములను గంభీరోపన్యాస మొనరించెను. విగ్రహారాధనకూడదని చెప్పునాతనినిగొందఱు పిచ్చివాడని హేళనచేసిరి. పరిహాస పూర్వకముగాఁగొందఱు ఛప్పటులు సఱచిరి. కొందఱుదూషించుచు దిగుమని వెనుక నుండి యార్చిరి. కాని కొంతమంది కతఁడు నుడివిన దానిలో సత్యము బోధపడెను. కొందఱతనికి శిష్యులుగాఁ గూడ నయి యతని ననుగమించిరి.

దయానందుఁడు నిజబోధామృతమును సంయుక్త రాష్ట్రములు వంగదేశము, బొంబాయి, రాజపుత్రస్థానము, పంజాబు మున్నగు ముఖ్యప్రదేశములలో వెల్లివిరియించెను. కొన్నిచోటులలో నతఁడు దెబ్బలుగూడఁదిని యెన్ని యిక్కట్టులకు లోనైనను దనబోధమాత్రము వదలలేదు. కొంతమంది కాశీపండితు లతనితో వాదింపదలచి యచ్చటకుఁ బిలువనంపిరి. ఏమి మూడునోయను భయముచే దయానందుని శిష్యులచ్చటికిఁబోవద్దనిరి. కాని దయానందుఁడు వినకధైర్యముతో వారణాసికిఁబోయి వారితో వాదమునకు సిద్ధపడెను.

అప్పుడు దయానందునకు వారితోఁ దీవ్రవాదము జరిగెను. పండితులోడిపోయిరి. హిందూమతమున కంతకును గేంద్రమనఁదగు కాశిలోనాఁడాతఁడొందిన విజయమున కతఁడెంతయు నుప్పొంగెను.

దిగ్విజయానంతర మొకనాఁడు దయానందుఁడు కాశిలో గంగానదియొడ్డున నేదియో దీర్ఘముగా నాలోచించుచుఁ గూర్చుండెను. నిరోధిపండితులిరువురది చూచి వెనుకగా వచ్చి యతనిని గంగలోనికిఁ ద్రోయుటకుఁ బ్రయత్నించిరి. వారతని చేతులను గట్టిగాఁ బట్టుకొని లోతునీటిలోనికిఁ దీసికొనిపోయి ముంచసాగిరి. కాని బలవంతుఁడైన దయానందుఁడుస్సైల్గీ యుండి వారిపైఁ దిరుగఁబడి తన రెండుచేతులతో వారిరువురి కంఠములను బిగ్గబట్టుకొని బుద్ధివచ్చునట్లు ముంచి లేవనెత్త మొదలుపెట్టెను. వారు రక్షింపుమని దీనముగాఁ బ్రార్థింపగాఁ గనికరించి విడచిపెట్టెను. ఇకఁ నెన్నఁడును నిట్టి నికృష్ట కృత్యము లొనరింపకుఁడవి హెచ్చరించెను.

దయానందునకుఁ బలువురు మహనీయులతోఁ బరిచయము కల్గెను. పూనాలో మహాదేవ గోవిందరెనడే యను మహనీయుఁడు దయానందుని బోధ మెచ్చుకొని యతని నేనుఁగుపై నూరేగింపవలెనని ఏర్పాటుచేసెను. దయానందుని ప్రతిపక్షుల దేసమయమున నొకనికి మసిపూసియొక గాడిదపై నూరేగించిరి. ఎవరిదుష్కృత్య ఫలము వారే యనుభవింతురు లెమ్మని దయానందుఁడు రెనడే ననునయించెను.

పంజాబులో దయానందుని బోధనలకు మంచి యాదరము కలిగెను. అక్కడఁ జాలమంది యనుయాయులేర్పడిరి. అమృతసర్ లో నతఁడొకమా రుపన్యసించుచుండఁగా గొంత

వుండికిఁ గోపమువచ్చి తిట్టుచు నీతనిపై లేచిరి. అతఁడు మాత్రమేమియుఁ దొందరపడలేదు. శాంతముగను, యుక్తి యుక్తముగను నతఁడు వారితో వాదించి వారిక్రోధము నుపశమింపఁ జేసెను.

గుజరన్‌వాలాయందును నొకగ్రామమున నతఁడొక వీధివెంట బోవుచుండఁ గొంతమంది దుర్మార్గులు రాలు రువ్విరి. అప్పుడు దయానందుఁడు చిరునవ్వునవ్వి "ఈనాఁడు నాపైన రాలురువ్వినవారే కొంతకాలమునకు జ్ఞానోదయమై నాపైన బూలురువ్వుదురు. అట్టి దినము త్వరలో రావలెనని నాకోరిక" అని పల్కెను. ఒకమారతఁడు వజీర్‌బాద్ అను చోట నుపన్యసించుచుండ నొకతుంటరి యొకరాయి పెట్టి యతనినిఁ గొట్టెను. అదితగిలి యతనికి రక్తము వెల్లువలై ప్రవహించెను. దానిని గుడ్డతో నద్దుకొనుచునే యతఁడుప న్యాసమును సాగించెను. ఎవ్వరినిగాని యేమియు ననలేదు. ఆహా ఎంతసాహసము! ఒక గ్రామమున నతనికి విషముపెట్టి చంపుటకుఁ బ్రయత్నము జరిగెను. ఒక తములపాకునకు విషముపూసి యొక బ్రాహ్మణుని ద్వారమున దానిని దయా నందున కందఁజేసిరి. పాపము తెలియక యతఁడు దానిని నమలెను. కాని వెంటనే గ్రహించెను. ఉమ్మివేసెను. దైవ కృపవలన నతని కేమియు హానిగలుగలేదు. దానిని బట్టుకొని వచ్చిన బ్రాహ్మణుఁడు భయపడి పారిపోయెను. కాని రక్షక భటులతనిని వెంబడించి పట్టుకొని కారాగారమున బంధించిరి. రక్షకభటాధికారి యొకఁడు దయానందునకు భక్తుఁడు. ఆ యధికారితోఁ జెప్పి తన మూలమునఁ జెఱఁదగిలిన బ్రాహ్మ ణుని విడిపించెను.

దయానందుఁ డొకప్పు డలహాబాదులో నుండగా నొక బ్రాహ్మణు డొక మిఠాయిబుట్ట తీసికొనివచ్చి స్వామికి సమర్పించెను. అప్పుడు స్వామి హైకోర్టు న్యాయాధిపతియగు సర్ సుందర్‌లాల్ అనువానితో మాటాడుచుండెను. స్వామి యా బ్రాహ్మణునకొక యుండనీయఁబోగా నతఁడు వలదనెను. స్వామి యెంత బ్రతిమాలినను నా బ్రాహ్మణుఁడు వినకుండెను. అంత సుందర్‌లాల్ ఒకటి తీసికొని యొక కుక్కకువైచెను. ఆ కుక్క దానిని దిని గిలగిల తన్నుకొని మరణించెను. ఆ బ్రాహ్మణుఁడు చేయఁదలఁచిన ఘోరకృత్యమును దెలిసికొని న్యాయాధిపతియగు సర్ సుందర్‌లాల్ అతనిని జెఱసాలకుఁబంప నిశ్చయించుకొనెను. కాని దయానందుఁడు దయానందుఁ డగుటచే నట్లు వలదని వారించి యా బ్రాహ్మణుని విడిపించెను.

ఒకప్పుడు రాజపుత్ర స్థానములో నుదయపుర మహారాజుగారు దయానందునిఁజూచి తన శివాలయములో మహంతిగా నుండుమని ప్రార్థించెను. విగ్రహారాధన కంగీకరింపని యాతఁడా పదము నెట్లొప్పుకొనును. అందుచే నతఁడు తిరస్కరించెను. దయానందుఁడు వర్ణభేదమును బాటింపఁడు. ఒక కూర్మకుఁ డొకప్పుడు దయానందుని కన్నముఁ దీసికొనివచ్చి యిచ్చెను. అతఁ డత్యాదరముతో భుజించెను. దయానందుఁ డొకమారు జోధపురమహారాజును దర్శించెను. మహారాజునకును స్వామికిని బరిచయ మంతకంతకెక్కువయ్యెను. స్వామి అదివర కెన్ని దినములనుండియో జోధపుర రాజునకు నొక దుర్మార్గునకును నుండిన స్నేహమునుమాన్పెను. ఆదుర్మార్గునిఁ గొలువులోనుండి తొలగింపఁజేసెను. అప్పటినుండియు వానికి

దయానందునిపైఁ గోపముగానుండెను. దయానందున కొక వంటవాఁ డుండెడివాఁడు. వానిపేరు జగన్నాథుఁడు. ఆ దుర్మార్గుడు జగన్నాథునిఁ బ్రలోభపెట్టి యేదియో విధమున దయానందునిఁ జంపవలెనని నిశ్చయించుకొనెను. అతని యాదేశమునననుసరించి జగన్నాథుఁడు డబ్బుకాశించి పంచదారతోఁబాటు గాజుచూర్ణముఁజేసి రెండును బాలతోఁగలిపి దయానందునకిచ్చెను. అతఁడు దానిని ద్రావిన కొంతసేపటికిఁగడుపునొప్పి ప్రారంభమయ్యెను. జరిగిన దుష్కృత్యము నతఁడు గ్రహించి జగన్నాథునిఁబిలిచి "నీవిచ్చటనుండిన నిన్నుఁజంపి వేయుదురు. ఇదిగో ధనము ఎచ్చటికైనను పారిపొమ్ము" అని హెచ్చరించెను. అతఁడట్లే హిమాలయప్రాంతములకుఁ బారిపోయెను. కొంతకాలమున కతఁడు పిచ్చివాఁడై కాలగతి నొందెను. ఎంతమంచి వైద్యులు వచ్చి మందిచ్చినను దయానందునకు గుదిరినదికాదు. వారు లాభములేదని పెదవివిఱచిరి. అక్కడనుండి యతని నజ్మీరునకుఁ గొంపోయిరి. అక్కడఁ గూడ నతనికి స్వాస్థ్యము గలిగినదికాదు. 'జాతస్య మరణం ధ్రువం' అని తెలిసికొనిన మహనీయుఁడుగనుక అతఁడానందముగనే యుండెను. తక్కినవారు మాత్రమతని యవస్థకు విచారించెడివారు. దయానందుఁడట్లే బాధపడిపడి 1883సం॥ అక్టోబరు 30 వ తేదీన పరమపదించెను.

# 6. తారనాథ బాబా

వంగదేశమునందు బంకూరామండలమున సోనాముఖి యను నొక జనపద ముండెను. దానిలో జయరామను నొక యుత్తమ గృహస్థుఁడు వాసముచేయుచుండెను. అతని భార్య పేరు భగవతీదేవి. ఆమె సాధుశీల, సద్గుణఖని. పరమపతివ్రత. ఆ దంపతులు పేదవారయ్యు యథాశక్తిగా నతిథి పూజలు సేయుచు శివభక్తి తత్పరులై, నిత్యసంతుష్టులై కాలముఁబుచ్చుచుండిరి. అదృష్టవశమున జయరామునకొక ప్రభుత్వోద్యోగము దొరకెను. దానిని గొంతకాలము జేసెను. విశేషధనార్జనోపాయములలో వాణిజ్యము సర్వప్రకారముల మేలగుటచే జయరాముఁడు స్వతంత్రముగా వర్తకము చేయనారంభించి యనతికాలములో విశేషధన సంపాదన మొనరించెను. అతఁడా యూరిలోని ధనికులలోనికెల్ల నగ్రగణ్యుఁడయ్యెను. తత్కాల పరిస్థితుల ననుసరించి కూడఁబెట్టిన ధనముతో న్యాయముగా వడ్డీవ్యాపారము మొదలుపెట్టెను. అట్లార్జించిన ధనమును కేవలము నిరర్థకముగాఁ గూడబెట్టక కొంత తాననుభవించి తక్కినది చాలవఱకుఁ బాత్రత యెఱిఁగి పరులకై వినియోగించెడివాఁడు. అతఁడు సహజముగా శివభక్తుఁడగుటచే స్వగ్రామము నందొక శివాలయమును గట్టించెను. అది వారి నిరుపమాన శివభక్తికి శాశ్వతచిహ్నము.

ఒకనాఁడు జయరాముఁడు కలకత్తాలో నుండఁగా సోనాముఖిలో నింటిదగ్గఱ నతని భార్యయగు భగవతీదేవి కొక యపూర్వానుభవము గలిగెను. ఆమె కడకొక సాధుపుంగవుఁడరుదెంచెను. సాధుసజ్జన దర్శనభాగ్యమునకై యువ్విళ్లూరుచు నిరంతరసేవా తత్పరయగు భగవతి యా

సాధువున కెదురేగి స్వాగతమొసంగి యుచితోపచారముల
చేతను భోజనభాజనములచేతను సంతుష్టునిగా నొనర్చి సావ
ధానమతియై యాతని దివ్యబోధామృతమును గ్రోలుచుండెను.
అతఁడామెకుఁ బెక్కు వేదాంత విషయములు బోధించి తుదకు
భగవన్నామ జపప్రభావమును బ్రాశస్త్యమును నుగ్గడించెను.
తరువాత నున్నవాఁ డున్నటులే యదృశ్యుఁడయ్యెను. భగ
వతీదేవి యతఁడు భగవంతుఁడే యనియుఁ దన్నుద్ధరించుట
కట్లు సాధురూపమున నరుదెంచినాఁడనియు గ్రహించి యమితా
నందము నందెను.

భగవతీదేవికి సాధుపుంగవ సందర్శనసమయముననే
కలకత్తానగరముననున్న జయరామునకొకస్వప్నమువచ్చెను.
దానిలో నొకసాధుజీ దర్శన మొసంగెను. అంతియకాక
యతఁడు జయరామునిజూచి "సజ్జనాగ్రణీ! నీ కనతి కాలము
ననే యొక పుత్రరత్నము లభింపఁగలదు. అబ్బాలుఁడు కేవల
భగవదంశచే జనించును. నామజప ప్రభావమెఱిఁగి నీవు సకు
టుంబముగా సుఖంబుండుము" అనిపలికి యంతర్ధానమయ్యెను.
జయరామునకు వెంటనే మెలకువగలిగి లేచి దైవానుగ్రహ
విశేషమున కచ్చెరు వందుచుఁ దత్క్షణమే నిజస్వప్న వృత్తాం
తమును భార్యకెఱిగింప సోనాముఖికిఁ బ్రయాణమయ్యెను.
త్రోవపొడవునను భగవన్నామస్మరణయే. ఆనందతాండవమే.
భక్తిపారవశ్యమే. జయరాముఁడు నిజగృహమునకుఁ జేరి
నంతనే భార్యాభర్తలిరువురును నెవరియనుభవములను వారు
పూసగుచ్చినట్లు చెప్పుకొనిరి. ఇరువురును నాశ్చర్యచకితులైరి.

పైనఁ బేర్కొనిన విషయము జరిగిన కొలది దినములకు
1865 వ సం॥లో భగవతీదేవి ముద్దులమూటఁ గట్టు నొక

బాలునిఁగనెను. పురుడుపదిదినములుసలక్షణముగాఁగడచెను. జయరాముఁడు పదునొకండవ దినమున బారసాల మహోత్సవముఁ జేసికొనఁ గుతూహలము గలిగి తగు ప్రయత్నములన్నియు నొనర్చెను. నాఁటి యుదయమొక పండితసభ నేర్పాటుచేసెను. సభ పదిగంటలకుఁ బ్రారంభము. సమస్త శాస్త్రకోవిదులగు పండిత ప్రకాండు లెందఱో వివిధవిషయములపైఁ జక్కగా నుపన్యసించిరి. బాలుని నామకరణమేమని చేయనగునా యని జయరాముని హృదయమాలోచన సల్పుచుండెను. అంతలోఁ బూర్వపు సాధుజీ యక్కడకువచ్చి తన వాగమృతముచే నందఱను ముంచెత్తియబ్బాలునిఁ జేతులలోనికిఁ దీసికొని స్వయముగా 'శ్రీహరనాథ్' అని నామకరణ మొనరించెను. తదుపరి యబ్బాలుని యవతారోద్దేశమును భక్తిభగవన్నామజప ప్రభావమును నందఱకును గర్ణ రసాయనముగా బోధించెను. ఆ సాధుపుంగవునియొక్కయు నితర పండితులయొక్కయు నుపన్యాసములచే నా సభ మూఁడు దినములు జరిగెను. తరువాత నెక్కడివా రక్కడకు వెడలి పోయిరి.

భగవతీ జయరాములు హరనాథు నల్లారు ముద్దుగాఁ బెంచుచుండిరి. అతఁడు నాలుగయిదేండ్ల ప్రాయమువాఁ డయ్యెను. ఇంతలోఁ బాపమాకస్మికముగా జయరాముఁడు మరణించెను. కుటుంబభరణభారము హరనాథునకంటెను పెద్దవాఁడగు శివరామునిపైఁబడెను. హరనాథునకుఁ గమలాదేవి యనునొక సోదరికూడ నుండెను. శివరాముఁడు హరనాథుని కంటెఁ బెద్దవాఁడే కాని వయసున కతఁడును జిన్నవాఁడే.

వారిరువురును గలిసియే చదువుకొనుచుండెడివారు. తల్లిభగవతియే వారికెట్టి లోపమును గలుగకుండ బోషించుచుండెను.

ఒకనాటి రాత్రి శివరామ హరనాథు లిరువురును దమగృహంబున కనతి దూరములోఁగల తమ పినతండ్రిగారి యింటియొద్దఁ జదువుకొని తిరిగియింటికివచ్చుచుండిరి. వారిరువురకును త్రోవలోనొక దివ్యపురుషుని సందర్శనము గలిగెను. ఆ తేజోమూర్తినిఁ గాంచినంతనే శివరాముఁడు భయగ్రస్తుడై చివరకు మూర్ఛపోయెను. పూర్వజన్మ సంస్కారముగల మన హరనాథుఁడు తన్మయుఁడై యామహాత్మునకు భక్తిపూర్వకముగా నమస్కరించి తాదాత్మ్యమును బొంది దేహభావము లేకుండఁ బడిపోయెను. మొదలనే మూర్ఛమునిగిన శివరాముడు కొంతవడికిఁ దెప్పరిలి వెంటనేయింటికిఁ బరువెత్తుకొని పోయి యావృత్తాంతమంతయుఁ దల్లికి నివేదించి యామెను వెంటఁబెట్టుకొని హరనాథుని యొద్దకుఁ బరుగెత్తెను. భగవతి యాదివ్యపురుషునికై నలుగడల వెదకెను. కాని కనఁబడలేదు అతఁడు భగవంతుఁడే యను నెఱుక గల్గిన యిల్లాలగుటచే వెంటనే భగవన్నామమును జేయుచుఁ గుమారుని దేహమాపాదమస్తకమొక్కసారి నిమిరెను. హరనాథునకు స్మృతికలిగి లేచి కూర్చుండి తల్లికి నమస్కరించెను. తల్లియుఁ బరమభక్తుఁడగు కుమారుని దివ్యానుభూతి కచ్చెరువందుచు నాతనిఁ గౌగిలించుకొని ముద్దాడెను. జరిగిన యత్యద్భుత విషయమును గుఱించి ముచ్చటించుకొనుచు వారింటికి వెడలిపోయిరి.

భగవతీ దేవి సహజప్రేమ స్వరూపిణి. ఆమెకుఁ గుమారు లిరువురును నొక్కరూపయ్యు హరనాథునిపై నధిక

వాత్సల్యము. హరనాథున కయిదాఱువత్సరములు వచ్చెను
అతని నెంతజాగ్రతగాఁ బెంచినను నెప్పుడును నేదియో
యొక రుగ్మతచేఁ బీడింపఁ బడుచుండెడివాఁడు సహజముగా
సన్నముగా నుండెడివాఁడు. బలహీనుఁడు. ఏమికారణము
నన్నో కాని యతఁడు నానాఁటికి క్షీణింపనారంభించెను.

శారీరకముగా దుర్బలుఁడయినను నతఁడు మానసిక
పటిష్ఠతగల్గి విద్యారంభ కాలమునుండియుఁ జురుకుఁదనముఁ
జూపుచుఁదోడిబాలురకంటె మిన్నగాఁ జదువుచుఁ బ్రైమరీ
పరీక్షలో నుత్తమశ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను. ఆపాఠశాలలోని
ప్రధానోపాధ్యాయుఁడు హరనాథుని నడవడినిగుఱించి చక్కని
యోగ్యతాపత్రము నొసంగెను. సోనాముఖి వదలి హరనాథు
డున్నత విద్యాభ్యాసమునకుఁ గలకత్తాకుఁ బోయెను. అతడుఁ
గలకత్తాలోఁ జదువుచుండగాఁ జిన్ననాఁటినుండియుఁ బాతు
కొనియున్న క్షయవ్యాధి తిరిగితలసూపెను. అది నోటరక్తము
కూడఁ బడునంతటి తీవ్రరూపమును దాల్చెను. ప్రతిదినము
సాయంకాలము కొంచెము జ్వరముకూడఁ దగులుచుండెడిది.
అయినను విద్యావ్యాసంగమును మాత్రము వీడలేదు. ఒక
నాటి యర్ధరాత్రమున నతఁడు నిద్రించుచుండఁగా నతని కొక
దివ్యవిచిత్రానుభూతి కలిగెను. ఒకానొక చిన్నగోపబాలుఁడు
హరనాథుని యురముపైకివచ్చికూర్చుండి యతనికి నోవకుండ
నతని పొట్టలోనుండి యొక మాంసపు ముద్దను వెలికిఁదీసి
యదృశ్యుఁడయ్యెనట. తెల్లవాఱి యతఁడు లేచుసరి కతని
క్షయ యంతయుఁ బటాపంచలై సంపూర్ణారోగ్యము గల
వాఁడయ్యెను.

హరనాథుఁడు కలకత్తాలో విద్యముగించి తిరిగి సోనాముఖి చేరుకొనెను. కుసుమాంబయను నామెను వివాహమాడెను. అక్కడ హరిసేవా సంఘమును నొకభాగవత సంఘమును స్థాపించి నామజప ప్రభావమును గురించి యందఱకును బోధించు చుండెను. అతఁడు జాతిమత భేదమును పాటింపఁడు. భగవంతుని దృష్టిలో నందఱు సమానులేయని యతని మతము. పూర్వాచార పరాయణుఁడగు నతనియన్న శివరామున కతని యభిప్రాయములు నచ్చినవికావు. అవి యన్నియు విపరీతముగాఁదోచెను. అందుచే శివరాముఁడు హరనాథుని నింటినుండి తరిమివైచెను.

స్వసామర్థ్యవిశ్వాసముగల హరనాథుఁ డావంతయు వంతనొందక సోనాముఖికి సమీపమునఁగల యయోధ్యకుఁ బోయి యచ్చట నుపధ్యాయవృత్తి నవలంబించి గౌరవముగాఁ గాలముఁ బుచ్చుచుండెను. అతఁడక్కడ నుండగాఁ గాశ్మీరమున నతనికొక యుద్యోగములభించెను. శ్రీనగరులో మతధర్మవ్యవస్థకు మంత్రియగు జయంతి ప్రసాదు బహద్దరు వారి యాదరాభిమానముల వలన నతఁడా యుద్యోగములోఁ బ్రవేశించెను. సహజముగాఁ దెలివితేటలు సత్ప్రవర్తనము గలవాఁడగుటచే నతఁడచ్చటఁ బైయధికారుల మన్ననకుఁ బాత్రుడై వేతనాభి వృద్ధినొంది సుఖముగాఁ గాలముఁ బుచ్చుచుండెను.

189[illegible] సం॥లో హరనాథునకు అతులవిహారనందియను మహానీయుని సాంగత్యలాభము గలిగెను. అప్పటినుండియు హరనాథుని దివ్యత్వము ప్రపంచమునకు విదితమయ్యెను. అప్పటికి హరనాథునకు ముప్పదియొక్క వత్సరములుండెను.

1896 సం॥లో గాశ్మీర దేశపు మహారాజు ప్రతి వత్సరము శీత కాలములో బయలుదేరు వాడుక చొప్పున శ్రీనగరునుండి జమ్మునకుఁ బ్రయాణమయ్యెను. హరనాథుఁడుకూడ యా మహారాజుతోఁ బాటు బయలుదేరెను వారు కొంతదూరము పోవుసరికి నాకస్మికముగా హరనాథుఁడు క్రిందబడి పోయెను. అందఱుఁ జూచుచుండగనే యతఁడు విగతజీవుఁ డగుటయు మరుక్షణముననే యొక దివ్యజ్యోతి యతని దేహమున ప్రవేశించుటయు జరిగెను. అంతనతఁడు నిద్రనుండి లేచినవానివలె 'నా పని నేనే స్వయముగా నెరవేర్చుకొన వలసిన సమయమాసన్నమయినది' యనుచు లేచికూర్చుండి ముఖమున బ్రహ్మతేజము తాండవింప దనతో నరుదెంచిన వారినందఱను జూచి భగవన్నామ ప్రభావమునుగుఱించి యపూర్వ బోధామృతమును వర్షించెను.

హరనాథుని దివ్యానుభూతులనుబట్టి చూడగా మొట్టమొదట నతనిశరీరమును దరువాత నతనియాత్మయు రెండును బరిశుద్ధములై దివ్యత్వము నొందినవి. హరనాథుఁడట్లు దివ్యపురుషుఁడయ్యు నైహికమును బూర్తిగా నొక్కమారు వదలక 1914 సం॥వఱకుఁ దాను జేయుచున్న యుద్యోగమునందే యుండెను. తరువాతఁ బూర్తిగా విరామ సౌఖ్యము ననుభవింపఁగోరి యుద్యోగమునుండి విరమించుకొనెను. అయినను నతనికిఁ గాశ్మీరప్రభుత్వమువారు కొంత వేతనమిచ్చుచునే యుండెడివారు. ఆ స్వల్ప వేతనముతోడనే కాలక్షేపముఁ జేయుచు తన మహత్తరసామ సందేశమును జనులెల్లరకందించుచుండెను. కలకత్తానగరములో నీతఁడు 'హరనాథ తత్త్వప్రచారిణీసభ' యనునొక సంఘమును స్థాపించెను.

1911 సం॥లోఁ బూరిలోఁ నొకభక్తుఁడు హరనాథునకు మూఁడున్నరయకరముల భూమి నుచితముగానిచ్చెను. ఆ ప్రదేశమున బాలసోదరుజమీందారుఁడును హరనాథభక్తుఁడు నగు నొక మహనీయుఁడొక దివ్యభవనమును గట్టించెను.

ఈవిధముగా హరనాథునకు బెక్కుమంది భక్తులేర్పడిరి. సిమ్లానగరమున నతఁడొక యాశ్రమమును స్థాపించెను. అట్లే బృందావనమున నొకదానిని నెలకొల్పెను. ఆ యా యాశ్రమవాసులగు భక్తులకు హరనాథుఁడు చూపిన విచిత్రానుభవములిన్నియని చెప్పుటకు వలనుపడదు. అవి యనంతము. అప్రమేయము. అతని కనుదినము భక్తులనుండి పెక్కు లేఖలు వచ్చుచుండెడివి. వానియన్నిటికిని నతఁడు ప్రత్యుత్తరము వ్రాసి పంపుచుండెడివాఁడు. అతఁడు కలియుగ కృష్ణుఁడు. నేఁటికి సుమారు నాలుగువందల సంవత్సరముల క్రిందట శ్రీకృష్ణచైతన్య ప్రభువు నామజపప్రభావమును లోకమునకు బోధించెను. అది మరపునకు వచ్చినట్లుండుటచే "గత్యాస్మరణాన్ముక్తిః" అనునాసందేశమునే శ్రీహరనాథుఁడు లోకమునకు జ్ఞాపకముఁ జేయుటకై ప్రాకృత పురుషుఁడై జన్మించెను. అట్టి మహాపురుషుఁడు నిజమత ప్రచారకార్యభారమును శిష్యవర్గముపై మోపి 1927 సం॥ మేనెల 25 తేదీన రాత్రి 9 గంటలకు భౌతికదేహమును జాలించి కీర్తి కాయుఁడయ్యెను.

---

# రామతీర్థస్వామి

పంజాబురాష్ట్రములో గుజరన్వాలా మండలమునందు మురళీవాలా యనునొక గ్రామముండెను. ఆ గ్రామమునందు క్రీ. శ. 1873 సం॥ అక్టోబ రిరువది రెండవ తేదీకి సరియగు కార్తీకశుద్ధ పాడ్యమీ బుధవారమునాఁడు హీరానందుఁడను నొక దరిద్రుని భార్య గర్భమున నొక కుమారుఁడుద యించెను. అతఁడే రామతీర్థస్వామి. హీరానందుని వంశము మిక్కిలి పవిత్రమయినది. వసిష్ఠమహర్షి యావంశమునకు మూలపురుషుఁడు. హిందీభాషలోఁ బ్రసిద్ధికెక్కిన రామా యణమురచించిన తులసీదాసీ వంశములోనివాఁడే!

రామతీర్థుని జననకాల దోషమెట్టిదో కాని యతఁడు పుట్టినకొన్ని దినములకే తల్లి మరణించెను. అతని పోషణ భారమంతయు నతని యన్నయగు గురుదాసుపైనను నొక ముసలి మేనత్తపైనను బడెను. ఆ మేనత్త పరమభక్తురాలు. గురుదాసుకూడ గొప్పభక్తుఁడు. బాల్యమునందు రామ తీర్థులు వారిరువురి కడను బెరిగినపుడే యతనిలో భక్తిబీజము లంకురించెను. పూర్వ సాంప్రదాయాను సారముగ నతని కైదవయేట నక్షరాభ్యాసముజరిగెను. స్వగ్రామమగు మురళీ వాలాలో నొకవీధిబడికిఁ బోవుచుండెను. మాతృభాషయగు హిందీ భాషయేకాక పారశీకము, ఉరుదు, సంస్కృతము మున్నగు భాషలనుగూడ నభ్యసించుటను మొదలుపెట్టెను. గురువు లొకసారి బోధించినఁ జాలును. దానిని వెంటనే ధారణచేసి యప్పగించెడివాఁడు. అయిదవ తరగతిలోనే యతనికి పెక్కుపారశీక గీతములు సంస్కృత శ్లోకములు

కంఠస్థములు అతనికాటలనిననసహ్యము దానికి వినియోగింప
వలసిన కాలమునుగూడ విద్యాభ్యాసమునకే నియోగించెడి
వాఁడు. పదవయేఁట నైదవ తరగతియందుత్తీర్ణుఁడయ్యెను.

మురళీవాలాలో మాధ్యమిక పాఠశాలలేదు. అందుచే
రామతీర్థులు స్వగ్రామము విడచి దానికేడుమైళ్ల దూరములో
నున్న గుజరన్వాలాకుఁ బోయెను. అక్కడ నతనికిఁ దగిన
గురువొకఁడు దొరకెను. అతని పేరు భగవద్ధనరాంజీ. అతఁడే
రామతీర్థుల కొకవిధముగ నాధ్యాత్మికగురువుకూడనయ్యెను.
గుజరన్వాలాలో నతఁడు చదువు ప్రారంభించిన దినముల
లోనే యామండలము నందలి వజీరాబాదా తాలూకాలోని
విరోకియను గ్రామము నందున్న రామచంద్ర పండితుఁడను
నొకసద్బ్రాహ్మణుని కుమార్తెనిచ్చి రామతీర్థులకువివాహము
గావించిరి. ఒక వత్సరమైనను దప్పక యతఁడు పదునైదవ
యేఁట మెట్రిక్యులేషను పరీక్షలోఁ దన పాఠశాలలో
ప్రప్రథముఁడుగ నుత్తీర్ణుఁడయ్యెను. విశ్వవిద్యాలయమునం
దుత్తీర్ణులైనవారిశ్రేణిలో నీతనిదిముప్పదియెనిమిదవస్థానము.

ఆపజయ మన్నది యెన్నఁడెఱుఁగని రామతీర్థులకుఁ
గళాశాల విద్యనభ్యసింపవలెనని మిక్కిలి కుతూహలముగా
నుండెను. కాని వలయు ధనములేదు. అయినను నతని తెలివి
తేటలకును సత్ప్రవర్తనకును మెచ్చుకొని గుజరన్వాలాపౌరులే
చందాలు వైచుకొని కళాశాలవిద్య కతనికిఁ గావలసిన ధన
మొసంగిరి. అతఁడు లాహోరు ఫార్మన్ క్రైస్తవ కళాశాలలో
బ్రవేశించెను. 'వృద్ధుఁడగు తండ్రికిఁ గుమారుఁడింకను జదు
వుట యిష్టములేకుండెను. పైపెచ్చు రామతీర్థులభార్య కాపు
రమునకుఁ గూడవచ్చెను. ఏదియేని నుద్యోగములోఁ బ్రవే

శించి కుటుంబ నిర్వహణమునందన్నకుఁ జేదోడువాదోడుగా నుండవలెనని హీరానందుని యభిప్రాయము. ఇట్టి తనయభిప్రాయమునకు వ్యతిరేకముగాఁ గళాశాలలోఁ బ్రవేశించుటచే నతఁడు రామతీర్థునిపైఁ గోపించి యింటినుండి వెడల నడచెను. తనభార్యను బోషించుభారముఁ దండ్రికి వదలనేలయని యతఁడామెనుగూడ లాహోరు నగరమునకుఁ దనవెంటఁగొని పోయెను. అచటఁ గొంతమంది విద్యార్థుల యిండ్లకేగి వారికిఁ బాఠములు చెప్పి దనకుఁగావలసిన డబ్బు సంపాదించు కొనెడి వాఁడు. 1890 సం॥ లో యఫ్. యె. పరీక్షలో నుత్తమోత్తమముగాఁ గృతార్థుడయ్యెను. తత్ఫలితముగా నతనికిఁ బ్రభుత్వమువారి యుచిత వేతనము లభించెను. దానితోఁదిరిగి రెండువత్సరములు పట్టపరీక్షకుఁ జదివెను. ఎంతబాగుగాఁ జదివినను దురదృష్టవశమున నతఁడు మొదటిసారి బి. ఏ. పరీక్షలోఁ గృతార్థుడు కాలేదు. అందుచే నతనికిఁ బ్రభుత్వము వారిచ్చుచున్న యుచిత వేతనము పోయినది. తిరిగి చదివి యాపరీక్షలో నెగ్గుట కతనికి గత్యంతరము గనఁబడకుండెను. తిరిగిపరీక్షకు ముప్పదిరూప్యములు కట్టవలసియుండెను. ఇంటికడ భార్యను బోషింపవలెను. ఎట్లాయని యతఁడాలోచించుచుండగా నాకళాశాలలోనే ఫలహారముల నమ్మె ఝూండూమల్లను నతఁడు రామతీర్థునిపై జాలిగలిగి భార్యాసమేతముగాఁ దనయింట నుండుమని యాతని నాహ్వానించి యాదరించెను. అతనిపై నెంతయో యభిమానముగల గిల్బర్ట్‌సన్ అను గణిత శాస్త్రోపన్యాసకుఁడు రామతీర్థులు పరీక్షకుఁ గట్టవలసిన ముప్పదిరూప్యములను దానేయొసంగెను. ఇంక నతనికేమికొదువ. అహర్నిశములును గష్టపడి చదివి

బి. ఏ. పరీక్షలో విశ్వవిద్యాలయమునందు మొట్ట మొదటి
వాఁడుగా నుత్తీర్ణుఁడయ్యెను. తత్ఫలితముగా నతనికి మరల
ప్రభుత్వపు టుచిత వేతనము లభించెను. ఎం. ఎ. పరీక్షకుఁ
జదువ నారంభించెను. అప్పటికతని కిరువదియేండ్లు మాత్రమే.
ఎం.ఏ. చదువుచు వేరొక కళాశాలలోఁ గొంతకాల ముపన్యాస
కుడుగా గూడఁ బనిచేసి డబ్బుసంపాదింప మొదలుపెట్టెను.
బి.ఏ.యమ్.ఏ. తరగతులలో గణిత మతనియభిమాన విష
యము. తనకుబోధించు నుపన్యాసకులకుఁ గూడఁ దెలియని
క్రొత్త విషయములెన్నియో రామతీర్థులు వారికడ ముచ్చ
టించుచుండెడివాఁడు. అతఁడు చదువు కళాశాల కధ్యక్షుఁ
డగు బెల్ దొర కతఁడనిన నత్యంతాభిమానము. యమ్. ఏ.
పరీక్షలోఁగూడ నతడుత్తమోత్తమముగా నుత్తీర్ణుఁడయ్యెను.

తరువాత రామతీర్థులు దాను జదివిన కళాశాలలోనే
గణిత శాస్త్రోపన్యాసకుఁడుగా గొంతకాలము పనిజేసెను.
ఆదినములలోనే యతఁడు "గణితముఁ జదువుటెట్లు ?" అను
నొక పుస్తకము వ్రాసెను. దేహ పరిశ్రమయెడ శ్రద్ధ తీసి
కొనక తదేకదీక్షతో కేవల మానసిక పరిశ్రమఁ జేయుటచే
నతని యారోగ్యము చెడిపోయెను. అద్దానిని బాగుచేసి
కొనుటకై యతఁడు స్వగ్రామమగు మురళీవాలాకుఁబోయెను.
అక్కడ కొంతకాలముండి యారోగ్యమునుబొంది తిరిగి
లాహోరునగరమునకువచ్చి యచట స్థానిక సనాతన ధర్మ
సంఘములోని విద్యాశాఖకు కార్యదర్శిగాఁ గుదిరెను. కార
ణాంతరములచే దానినుండి విరమించుకొని 1895 సం॥లో
సియాల్ కోటులో మిషన్ ఉన్నత పాఠశాలలో నతఁడు

ద్వితీయోపాధ్యాయుఁడుగా నెలకు 80 రు మీఁదఁ బ్రవేశించెను. అతఁడక్కడఁ పనిచేయుచున్నప్పుడు లాహోరుకళాశాలలోఁ బ్రధానగణితశాస్త్రోపన్యాసకుని పదవి ఖాళీయయ్యెను. 1897 సం॥లో రామతీర్థులా పదవిని స్వీకరించెను. అక్కడ నతనికి వచ్చుజీతమంతయు దానధర్మములకే వినియోగించుచుండెడి వాఁడు. ఆదినములలోనే యతడు విరామకాలములలోఁ బ్రాచ్యపాశ్చాత్య వేదాంత గ్రంథముల నన్నింటినిఁబూర్తిగా జదివెను. శంకర, కపిల, కాణాద, గౌతమ, పతంజలి, జైమిని, వ్యాసాదుల గ్రంథములును, కేంట్, హీజల్, గెది, ప్లేటు, స్పినోజా, కోమ్టి, స్పెన్సర్, డార్విన్, హెకెల్, టిన్డాల్, హాక్లీ, జేమ్సు మున్నగువారి గ్రంథములును నతనికి కరతలామలకములు. అతఁడనుదినము రావీనదీ తీరమునకుఁబోయి యాయా గ్రంథములయందలి సారమును మననముఁ జేసి కొనెడివాఁడు. అంతియెకాక యతఁడు చతుర్వేదములను, నుపనిషత్తులను, భగవద్గీతను, జ్యోతిష, న్యాయ, మీమాంసాది సమస్తశాస్త్రములను జైన, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది సర్వమతముల ప్రమాణ గ్రంథములను గూలంకషముగాఁ జదివెను. అతనికిఁ బారసీకము, ఆంగ్లము హిందీ, ఉరుదు, సంస్కృతము మున్నగు భాషలలో మంచి ప్రావీణ్యమ్ముకలదు.

1897 లో రామతీర్థులు లాహోరు కళాశాలలో బని చేయుచున్న దినములలో వేదాంత కేసరియగు వివేకానందుఁ డుపన్యాసమునిచ్చుచు నచ్చటికి వచ్చుట తటసించెను. దైవసంకల్ప బలమున రామతీర్థ వివేకానందులకుఁ బరి

చయము గలిగెను. రామునియింటనే వివేకానందుని బస. రాముఁడే వివేకానందునకు సభనేర్పాటు చేసెను. రామకృష్ణునియుపన్యాసములువివేకానందు నాకర్షించినట్లు వివేకానందుని బోధనలు రామతీర్థుల హృదయమును జూఱగొనెను. తత్ఫలితముగా 1898 స॥లోఁ దనయధ్యాపకత్వమునకు రాజీనామాపెట్టి దినమునకు రెండుగంటలు మాత్రమే పనిఁజేయవలసిన 'ఓరియంటల్ కళాశాల'లో రీడర్ పదవి స్వీకరించెను. దానిలోగూడఁగొన్ని నెలలుమాత్రమేయుండెను. దేశసేవకుఁ బత్రికానిర్వహణ మొకసాధనమనియెంచి 1898 సం॥లో నుర్దూభాషలో 'ఆలిఫ్' అనునొక పత్రికను స్థాపించి యొక ముద్రణాలయమునుగొని వేదాంతవిషయప్రచారమును జేసెను.

వివేకానందుని బోధలను విన్నప్పటినుండియు రామతీర్థుల హృదయము నానాటికిఁ బరిపక్వస్థితికి వచ్చెను. 1900 సం॥ జులై నెలలో రామతీర్థులన్ని పదవులను వదలి భార్యను బిల్లలను, వెంటగొని వానప్రస్థము స్వీకరింపఁ దలచి హరిద్వారము మీఁదుగా టెహరిచేరెను. అక్కడ గంగానది యొడ్డున నొక యాశ్రమమును నెలకొల్పి సుమా రాఱు నెలలపాటు దానిలోఁ గడపెను. తరువాతఁ గేవల ముముక్షువై దారపుత్రాది బంధములను గూడఁ ద్రెంపగోరి భార్యను, కుమారుడగు బ్రహ్మానందుని నింటికి కంపివేసెను. ఏకాంతవాసియై రామతీర్థులు 1901 సం॥ ద్వారక శంకరాచార్య పీఠాధిపతి యనుజ్ఞఁదీసికొని పూర్తిగా సన్యాసమును స్వీకరించెను. అప్పటినుండియు నతఁడు స్వామిరామతీర్థయనిగాని, తీర్థరామస్వామియనిగాని వ్యవహరింపబడుచుండెను.

సన్న్యసించు నప్పటినుండియు తీర్థరాముఁడు టెహరీలోఁ గొంతకాలముండి తరువాత దేశపర్యటన మారంభించెను. అతఁడు టెహరీలోనున్నప్పుడే టెహరీ మహారాజతనినిదర్శించి ముఖ్యశిష్యులలో నొకడయ్యెను. 1893 సం॥లో చికాగో నగరమున జరిగినట్లు జపానులోగూడ నొక సర్వమత మహా సభ యొకటి జరుగునని విని దానికి తీర్థరాముఁడేగెను. అక్కడ నతనికి మంచి యాదరాభిమానములు లభించెను. ఇండో జపానీస్ భవనమున బసజేసెను. దాని కార్యదర్శియు, సిక్కు మతస్థులలో నొకఁడును అగు పురాణసింగు తీర్థరామున కనేక సౌకర్యములు గల్పించి అతనిబోధలను, గొప్పతనమును బలుతావులఁజాటెను. తీర్థరాముని శిష్యులలో నతఁడుముఖ్యుడు జపానులో నతఁడను కొనిన సర్వమత మహాసభ జరుగలేదు. వచ్చినందుల కూరకపోనేలయని యతఁడు పెక్కుతావుల హిందూమత ప్రాశస్త్యమునుగురించి యుపన్యసించెను. అతని యుపన్యాసములు వినినపెక్కుమంది విదేశీయపండితు లతనిని మిక్కిలిగాప్రశంసించిరి. టోకియో విశ్వవిద్యాలయ సంస్కృతాధ్యాపకుఁడగు తకాకుత్సు బండితుఁడు తీర్థరామునిఁజూచి మాకన్నముల్లరు కంటెను నతఁడు ఘనుఁడని కొనియాడెను.

1903 సం॥లో తీర్థరాముఁడు అమెరికాకు బోయెను. 1893లో వివేకానందుఁడు అమెరికాదేశీయులకుఁజేసినబోధన లను మఱియొకసారి జ్ఞప్తికిఁ దెచ్చెను. అతఁడక్కడ రెండు సంవత్సరముల కాలముండి జపానుమీఁదుగా భారత దేశము నకుఁ దిరిగివచ్చెను. స్వదేశమున నుత్తర హిందూస్థానములో నతఁడనేక నగరములలో గంభీరోపన్యాసము లిచ్చెను.

యమునానదీ తీరముననున్న ముత్రా పట్టణ ప్రాంతమున శాంత్యాశ్రమమను నొకదానిలో పారశీకుఁడగు నొకమునితో గొంతకాల ముండెను. బాల్యమునుండియు ఖద్దరు వస్త్ర ధారణము జాతీయ భావములు మతప్రచారదీక్ష మున్నగు లక్షణములుగల తీర్థరాముని బ్రభుత్వ మనుమానించెను. అందుచే నతని వర్తన మెప్పటికప్పుడు రహస్య చారులవలన దెలిసికొనుచునే యుండెడిది. అతఁడును నది గ్రహించి తదను గుణముగాఁ బ్రవర్తించుచుఁ దనదగ్గఱకు వచ్చిన యా చారులకుఁ దనయెడ భక్తితాత్పర్యములు గల్గునట్లొనర్చెడివాఁడు. శాంత్యాశ్రమమును వదలిన తరువాతఁ గొంతకాలము పుష్కర కాసార తీరమందున్న క్రిష్ణఘుర్ రాజభవనములోఁ గడపెను. తరువాత బదరీనారాయణమునకు బోవుమార్గములో హృషీకేశమునకుఁగొలదిదూరముననున్న వ్యాసాశ్రమమునకుఁబోయి కొంతకాల మచ్చట నుండెను. అప్పటి నుండియు నతఁడు దేహాభి మానమును బూర్తిగా వదలి నఖశిఖలు పెంచి మౌనవ్రతముఁ బూని ధ్యానసమాధి నిష్ఠుఁడయ్యెను. తుది దినములలో తీర్థరాముఁడు వ్యాసాశ్రమమును వదలి వసిష్ఠాశ్రమమునకుఁ బోయి యక్కడ గాలక్షేపముఁ జేయ మొదలు పెట్టెను. అతఁడిపుడు పూర్ణముగా నంతర్ముఖుడై బాహ్య ప్రపంచముతో సంబంధము లేకుండెను. అతఁడట్లే యుండి యుండి 1906 సం॥లో అక్టోబరు 18వ తేదీ ఉదయము గంగా నదికి స్నానమాడనేగి తత్కాల వాహినిలోఁగలిసి జలసమాధి యయ్యెను.

కవి, సంస్కర్త, దేశభక్తుడు, మతోద్ధారకుఁడు, పండితుఁడు, యోగియగు తీర్థరాముఁడు దేశమునకును,

సంఘమునకును, మతమునకును జేసినసేవ నిరుపమానము. బాల్యవివాహముల నరికట్టెను. కన్యావైధవ్యమును గాలఁ దన్నెను. స్త్రీలను, బాలురను, శూద్రులను, నుద్ధరించెను. దేశభక్తినిఁ బెంపొందింప జేసెను. వైదిక మతోద్ధరణఁ గావించెను. వేయేల భారతజాతిని సర్వవిధములఁ బునరుజ్జీవింప జేసెను. అతఁడు ధన్యజీవి చిరస్మరణీయుఁడు.

Printed at the Krishnananda Press, Powerpet-Ellore.
For Venkatrama & Co., Bezwada.